# శుకసప్తతికథలు



గ్రంథకర్త:

కొవ్వలి లక్ష్మీనరసింహారావుగారు.



2వ కూర్పు 2000 ప్రతులు.



ప్రకాశకులు:

శ్రీసత్యనారాయణ బుక్ డిపో,

పబ్లిషర్సు & బుక్ సెల్లర్సు,

రాజమండ్రి.

1937

# నవలలు.

| | రు | అ | | రు | అ |
|---|---|---|---|---|---|
| పంజాబుమెయిలు | 0 | 12 | వ్యామోహము | 1 | 0 |
| విషహృదయము | 1 | 0 | ఫ్లవర్ గరల్-పువ్వులపిల్ల | 0 | 12 |
| రమాసుందరి 1 వ భా॥ | 0 | 12 | అల్లరిపిల్ల | 0 | 12 |
| ,, 2 వ భా॥ | 0 | 12 | రివాల్వరు | 0 | 12 |
| నీవేనా ? | 0 | 12 | శకుంతల బి. ఏ. | 0 | 12 |
| టోపీదాను | 0 | 6 | చదువుకొన్న భార్య | 0 | 12 |
| శక్తికుమారి | 0 | 12 | అల్లూరి సీతారామరాజు | 0 | 6 |
| రక్తవాహిని | 0 | 12 | లోకాభిరామాయణం | 0 | 6 |
| ఇంద్రజాలము | 0 | 12 | దొంగలనాయకుడు | 0 | 12 |
| రాజద్రోహి | 0 | 12 | హతింతాయి | 0 | 12 |
| వలపులరాణి | 0 | 12 | ఘోరహంతకుడు | 1 | 0 |
| అర్ధరాత్రపువింత కెహత్యలు | 0 | 12 | కన్నపుదొంగ | 0 | 12 |
| అఘోరి | 0 | 12 | మోహపిశాచము1 వ భా॥ | 0 | 12 |
| అగ్గిరాముడు | 0 | 12 | ,, 2 వ భా॥ | 0 | 12 |
| నే నెవరిభార్యను ? | 1 | 0 | ప్రతాపసింహ 300 పే॥గ్లేజు | 1 | 8 |
| నే నెవరిభర్తను ? | 1 | 0 | బాకుపోటు | 0 | 12 |
| బలేపెండ్లి | 0 | 12 | మగడుకానిమగడు | 0 | 12 |
| సాహసికుడు | 0 | 12 | రాజరత్నం | 0 | 12 |
| భయంకరుడు | 0 | 12 | పగటిచుక్క 1 వ భా॥ | 0 | 12 |
| నరేంద్రుడు | 0 | 12 | ,, 2 వ భా॥ | 0 | 12 |
| ఏకోదరులు | 0 | 8 | కాలసర్పం 1 వ భా॥ | 0 | 12 |
| ప్రతిబింబములు | 1 | 0 | ,, 2 వ భా॥ | 0 | 12 |
| ఆనందభవనం | 0 | 12 | దురాశఅను ఆశాపిశాచము | | |
| 13 వ నెంబరుగది | 0 | 12 | 1 వ భాగము | 0 | 12 |
| వజ్రహారము | 0 | 12 | డిటో 2 వ భాగము | 0 | 12 |

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.

# శుకసప్తతికథలు



గ్రంథకర్త:

కొవ్వలి లక్ష్మీనరసింహారావుగారు.



పబ్లిషరు:

కొండపల్లి వీరవెంకయ్య,

శ్రీ సత్యనారాయణ బుక్కుడిపో,

రాజమండ్రి.

1937

 [వెల **1—0—0**

# పీఠిక.



'శుకసప్తతికథలు' అనబడు నీగ్రంథమునందలి నాయకి యొక రాజకుమారునితో వ్యభిచరింపబోవ, నామెయింటనుండు చిలుక యామెను వారించి, యామెకనుదినంబును గథలఁజెప్పుచు, నామెభర్త గ్రామాంతరములనుండి వచ్చువరకు కాలయాపనముజేసి, యామెను జారత్వదోష మంటకుండజేయును. అట్లు చిలుక చెప్పిన కథలమూలమున నా నాయకి తనదుశ్శీలమును బాసి, యెట్లుపవిత్రురాలైనదియు నిందు గానవగును.

ఈగ్రంథమునే యనేకులనేకవిధంబుల వ్రాసిరి. ఆగ్రంథములన్నిటిగల యసందర్భములగని, వాటికంటె నుత్తమగ్రంథమును వ్రాయబూనిన నాప్రయత్న మెంతవరకు సఫలీకృతమైనదియు విజ్ఞులెరుంగుదురుగాక! మరియు నిందలిదోషములమన్నించి, బుద్ధిమంతులగు పాఠకులు గుణములనే గ్రహించెదరుగాక!

రాజమండ్రి,
20-7-1935



ఇట్లు,
కొవ్వలి లక్ష్మీనరసింహారావు.



# విషయసూచిక.



ఓం

అవిఘ్నమస్తు.

శ్రీరామాయనమః.

# శుకసప్తతికథలు.



## I వేటగానివృత్తాంతము.



మున్ను కురుక్షేత్రసమీపారణ్యంబున భీముండను నొకవేట గాడు కలడు. వా డనుదినంబునను నాయరణ్యప్రాంతమంతయు సంచరించి పక్షులవేటాడి, వాటినా సమీపనగరంబునకు గొనిపోయి, విక్రయించి, తన్మూలమున వచ్చినధనముతో నుదరపోషణము గావించుకొనుచుండును.

ఇట్లుండ, నొకనాటి సాయంసమయమునం దావేటగాడొక వటవృక్షముపై నొకచిలుకలగుంపుగని, "ఆహా! నేడు నాభాగ్యమేమని చెప్పుదును వందచిలుక లొక్కసారిగా లభింపనై యున్నవి. రేపటియుదయమున నేనిటకరుదెంచి, యీపక్షు లాహారాన్వేషణమున కరిగినతరుణమున, నావల నావృక్షమున బన్నుదును. అవి సాయంసమయమున యథాప్రకారంబుగ నరుదెంచి, నావలలో జిక్కుకొనును. వాటినన్నటిని విక్రయించిన నాకెంతయో ధనమురాగలదు" అని పరమానంద భరితుడై నాటికి నిజగృహంబున కరిగెను. ఆమరునాటి వేకువ నాతడుతిరుగ నావృక్షముకడకరుదెంచి, చిలుకలన్నియుసంచారమున కరుగుటగుర్తించి

యావటవృక్షమున వలబన్ని చనియెను. ఆసాయంకాలమున మేతకరి గిన చిలుకలన్నియు, నిజనివాసంబగు నావటవృక్షమున యథాప్రకార ముగ్రాల, నందున్న వలలో చిక్కుకొనియెను. అంతనాశుకంబులన్నియు నాటితో దమకాయువుపూర్తియాయెంగదాయని మిగుల దుఃఖింపదొడం గెను. అట్లు తెరవుగానక విలపించుచున్న పక్షులగని, వాటికిరాజైన శుకమిా ప్రకారంబుగా చెప్పదొడంగెను. “ఓచిలుకలారా! మన మూరక యిట్లు దుఃఖించుచు గూర్చొనినయెడల లాభములేదు. ఎట నయినను నేడ్పువలన కార్యములు కొనసాగుటగలదా? బుద్ధిమంతులగు వారు తమకు గష్టములు కలిగినపుడే ధైర్యమవలంబించి, యుపాయం బున నాయపాయంబును దప్పించుకొనవలయును. అందులకు నాకొక్క యుపాయము తట్టుచున్నది. ఆప్రకార మాచరించినచో, మనమెల్లర మునుగూడ దప్పించుకొని, వేటగాని మోసపుచ్చి పారిపోవచ్చును. నా యాలోచన యేమందురేని—కిరాతుడు వచ్చుసరికి మనమెల్లరము మృతు లైనపగిది చేష్టలుదక్కి పడియుందము. ఈచనిపోయిన చిలుకలు మన కేలనని వేటగాడు మనలనెల్లర నొక్కటిగా వలనుండిదీసి, నేలపై బార వైచును. నూరుచిలుకలును నవనిపై బడినంతనే మనమందరము తుర్రుమని పారిపోయి ప్రాణరక్షణము గావించుకొందము”.

తమరాజు చెప్పిన యీయాలోచనకెల్లపక్షులును నానందమున సమ్మతించి, కిరాతుడు వచ్చుసరికవియన్నియు జచ్చినవిధాన బడియుం డెను. మనమున నెంతయో యాశగొని వచ్చిన నావేటగాడు వలను దించి చూడ, నాపక్షులన్నియు చచ్చిపడియుండుటనుగని, నిరాశుడై, తనదురదృష్టమును నిందించుకొనుచు, నొక్కొక్కచిలుకనే వలనుండిదీసి బారవైచుచుండెను. అట్లు తొంబదితొమ్మిది చిలుకలనాతడు బార వైచునప్పటికా వృక్షమునుండి యొకయెండుమ్రానురాలి నేలపై బడగా నదియు నొకచిలుకయే యనుకొని, మిగిలిన చిలుకలన్నియు తుర్రుమని

పారిపోయెను. అంత నావేటగాఁడా పక్షులు తన్నుచేసిన మోసమున కుగ్రుఁడై యింకను వలయందున్న నూరవదగు రాజుచిలుకను దనకరి నాంగుళింబట్టి కోపమున నులిపివేయ నుద్యుక్తుఁడుకాఁగా, నాకీరరాజంబు కిరాతున కిట్లనియె.

"అన్నా! పోయినపక్షు లెట్లునుపోయినవి. నన్నూరక నిట్లు నులిపివేసిన నీకేమిలాభము? నన్నంగడికి గొనిపోయి యేధనికునకయిన నమ్మఁజూపుము. నావలన నీకు వేయివరహాలు రాఁగలవు. అప్పుడు నినుబోలిన ధనికులెవరుందురు?" అని యాచిలుక యిట్లు మనుష్య భాషణంబున జెప్ప, కిరాతు డాశ్చర్యమంది, దానినమ్మిన వేయివరహాలును రావచ్చునని యెంచి, దానిని జంపక యంగడికిగొనిపోయి, యమ్మ జూపుచు, నెవరడిగినను, వేయివరహాలకు దమ్మిడీతక్కువ కీయనను చుండెను. ఒకయణా విలువజేయని యాపక్షి కతఁడంతమూల్యముజెప్పు చుండుటచే నెల్లరును వానినొక పిచ్చివానినిగాదలంచి, నవ్వి పోవుచుం డిరి. ఇంతలో నాపట్టణమునకెల్ల ధనికుఁడగు రత్నదీపుఁడను వర్తకుండా చిలుకనుగని, దానియందమునకు ముచ్చటపడి, 'ఓయీ! కిరాతా! దీనికి నీవంతమూల్యము జెప్పుటతగదు. తగ్గించియిమ్ము. నేకొనెదను' అని యడుగ నాకిరాతుండు "ఈచిలుక వేయివరహాలకు దమ్మిడీదక్కు వకైన రాదు" అని ఖండితముగా జెప్ప, నాకోమటి కొందునా, మానుదునా యని యాలోచించుచుండ, చిలుక వానినిగని, "ఓ బేహారీ! వేయివరహాల నీకిరాతునకొసంగి నన్నుగొనుము. నావలన నీకధికలాభము కలుగఁగలదు" అన, మానవునివలె మృదుభాషణంబుల పలుకుచున్న నాచిలుక నావర్తకుడిక సందేహించక వేయివరహాలను గిరాతునకిచ్చి, కీరమును నిజగృహంబునకు గొనిపోయెను.

నాటనుండియు, నాచిలుకయే రత్నదీపునకు బనులుగా బేరము లన్నియు సాగించుచు, ష్రూచువారల కెల్లరకు నధికముదము గూర్చ

చుండెను. బేరములన్నియు రత్నదీపునకుదప్ప నితరవర్తకులకు రాకుండెను. దాన రత్నదీపుండా చిలుకమూలమున నధికధనము నార్జించుచుండెను. ఆచిలుక బేరముల జేయుటయేగాక నెల్లరకును వినోదకథల జెప్పుట, నొండొరుల తగవుల నిష్పక్షపాతబుద్ధితో దీర్పుజెప్పుట, మొదలగు వింతకార్యముల నెన్నింటినో జేయుచుండెడిది. ఆబేహారియు నాచిలుకనొక బంగారు పంజరములోబెట్టి యతిగారమున బెంచుకొనుచుండెను.

---

# 2 చిలుక చెప్పిన కథ.



వేయివరహాలనిచ్చి, చిలుకను కొనినవర్తకునకు, సౌందర్యమున రంభ, యూర్వశి, తిలోత్తమలమించు మందారవల్లియను నవలావణ్యవతియగు నొకభార్యకలదు. మందారవల్లినిమించిన మోహనాంగులీ పృథ్వీతలంబున లేరనుప్రతీతికలదు. సమీరపవనుండరుదెంచి, యెల్లరకు నుల్లాసమును గలిగించు నొకనాటి సాయంసమయంబున మందారవల్లి శిరఃస్నానమొనరించి, తనమేడపై దీర్ఘకురుల నారబెట్టుకొనుచు, సవిలాసమున విహరించుచుండు సమయంబున నాపట్టణమునకు రాజగు మలయకేతుండు వివిధాలంకార పరిశోభితుండై, నిజపరిజనంబువెంటరా నొకయుత్తమాశ్వము నధిరోహించి, మహావైభవంబున నామార్గముగుండాజనుచు, మేడపై వినోదకేళిం దిరుగుచు నెల్లరకు దిగ్భ్రమగొల్పు మందారవల్లి జగద్విఖ్యాతలావణ్యమునుగని ముగ్ధుడయ్యెను. ఆలలనామణియు నారాజేంద్రుని మన్మథాకారమునుగని మోహించి, తన క్రీగంటిచూపుల నాతనిపై బరపి, యాతనితో నెట్టులయిన రతిక్రీడలందేల కృతనిశ్చయురాలయ్యెను. మలయకేతుండు నిజభవనంబునకుజని తానా ప్రొద్దుగాంచిన సుందరాంగిని గూడుటెట్లాయని పరిపరివిధంబుల

నాలోచించి, కడకు సాహసించి, యొకనేర్పరియగు పరిచారికినిరావించి "ఓసీ! నీ వతిరయంబున రత్నదీపుని గృహంబునకరిగి, యావర్తకుని భార్యయగు మందారవల్లికి నావలపునెరింగించి, యామగువ నెట్లయిన మన యంతఃపురంబునకు గొనివచ్చితివేని, నీవు బహుయనేకంబుల బడయగలవు" అని నుడువ, నాచతురమతియు ప్రభునాజ్ఞననుసరించి, మందారవల్లిని గలసుకొని తిరుగవచ్చి రాజునకీప్రకారంబు చెప్పెను. "ప్రభూ! మందారవల్లియు మీయందధికమోహమును గలిగియున్నది. కాని యామె భర్తయగు రత్నదీపునకువెరచి, తమకడకు రావెరచుచున్నది" అనియె.

అంత మలయకేతుండు రత్నములదెచ్చు మిషనుగల్పించి, యావర్తకునికి బహుదూరప్రయాణంబగు మలయద్వీపమునకు బంపెను. ఆబేహారి తిరుగ వచ్చువరకును దాను మందారవల్లితో యథేచ్ఛగా సుఖింపవచ్చునుగదాయని మలయకేతుం డువ్విళ్లూరుచు, నారేయి దప్పక దనయంతఃపురంబునకు రావలసినదిగా మందారవల్లికి వర్తమానమంపెను. ఆ మగువయు జారత్వమను పాపభీతిలేక, యానాటిరాత్రి రాజుతో సురతభోగంబుల నందదలచి, బన్నీటజలకమాడి, మంచిగంధాది సువాసనద్రవ్యముల నలుముకొని, సర్వవిధామూల్య వస్త్రాభరణములతో శృంగారముగ నలంకరించుకొని, రాజాంతఃపురంబున కరుగ నుద్యుక్తురాలై యుండ, నాగదియందు బంగారుపంజరములోనున్న చిలుక మందారవల్లినిగని, "సోదరీ! మలయకేతునితో మదనక్రీడలదేల నరుగుచుంటివికదా! వ్యభిచరించుటలో నెంతటిసామర్థ్య ముండవలయును? ఎట్టిచమత్కారశక్తి యుండవలయును? రంకునేర్చినయమ్మ బొంకనేర్వవలయునను సామెతను వినలేదా? అట్టిశక్తి నీకడ లేదుగాన, వ్యభిచారకార్యమునందతి నేర్పరియై చరించిన మదనరేఖయనుదాని కథను నీకు

జెప్పెద సావధానచిత్తవై యాలకించి, అట్టిసామర్థ్యము నీకుగూడ గలి గినపిమ్మటనే నీవు వ్యభిచరింపుము. అట్లుకానిచో బ్రమాదము రావచ్చును" అనిచెప్ప, "ఓశుకరాజమా! ఏదీ. ఆమదనరేఖ వ్యభిచారమునం దెట్టిసామర్థ్యము గనపరచెనో చెప్పుము విందును" అని మందారవల్లి చిలుకతో ననియెను.

అంతట నాకీరము మందారవల్లికి మదనరేఖకథ నీప్రకారం బుగా జెప్ప నారంభించెను.

---

# 3 మదనరేఖకథ.



"తొల్లి లవంగపురంబను నొకపట్టణముగలదు. అద్దానిని ఇందువర్మయనురాజు పరిపాలించుచుండెను. అతని కసమానరూపరేఖా విలాసినియు, నవయౌవన ప్రావిర్భూతయునగు మదనరేఖయను భార్య గలదు. ఆరాజునొద్దనున్న వినయుండను సేవకుడు మదనరేఖయందు వలపుగొన్నవాడై, యొకదినంబున సమయము గనిపెట్టి తన మనో వాంఛితము నామగువకెరింగించి, రహస్యముగా దన్ను గూడుమనియెను. ఆమగువయు వానిపొందునుగోరి, యదిసమయముకాదనియు, రాజూర లేనప్పుడు తామిరువురమును యథేచ్ఛగా సురతభోగంబుల నందవచ్చు ననియు జెప్ప వినయుండెంతయు సంతసించి, సమయమునకై వేచియుం డెను.

ఇట్లుండ నొకనాడు ఇందువర్మ గ్రామాంతర మరుగవలసివచ్చి, భార్యను జాగ్రత్తగా యుండుమనిచెప్పి, ప్రయాణంబై చనియెను. అంత మదనరేఖయు వినయునితో గామభోగంబులనంద మంచిసమ

యము లభించినదని తలంచి, యానాడె యొకనమ్మకమైన పరిచారిక ద్వారా దనవలపుగానికి వర్తమానమంప, నతడు చలువవలువలధరించి, విలాసముగ నలంకరించుకొని, మదనరేఖతో క్రీడింప నుత్సాహపడుచు రాజాంతఃపురంబున బ్రవేశించెను. నాడా మదనవతి యాసేవకపురుషు నితో దనివితీర రతిక్రీడలందేల, రాజువచ్చువరకును ననుదినంబును నట్లే నచ్చుచుండుమని మదనరేఖ తనయుంపుడుగానితోజెప్ప, వాడు నట్లెయని నాటికి చనియెను.

ఆనాడుమొద లతడనుదినంబును రాజాంఃపురంబునకరిగి యా మదవతితో సురతభోగంబుల నందుచుండెను. ఇట్లొక వారముదినములు గడువ, నొకయర్ధగాత్రంబున నామె నిజభర్తయగు నిందువర్మ తలవని తలంపుగా గ్రామాంతరమునుండి యరుదెంచి, తలుపుతట్టెను. అంత, మదనరేఖతో నిష్టలీల గ్రీడించుచున్న వినయుండు రాజురాక నెరింగి భయవిభ్రాంతుడై, తనకానాడు ముప్పువాటిల్లితీరునని విచా రింపదొడంగెను. అంతట జతురమతియగు మదనరేఖ వానికి ధైర్యము గొలిపి, మంచముక్రింద దాగియుండుమనిచెప్ప, వాడట్లె ప్రాణముల నరచేతబట్టుకొని మంచముక్రిందదూరి దాగొన, మదనరేఖ యరిగి దలుపుతీసెను. అంత ఇందువర్మ యామృదుతల్పంబునందే గూర్చొని, భార్యను గుశలప్రశ్నంబులనడుగ, నామె భయమును నటించుచు "నాథా! మీరీవిధంబున నన్నీవియోగజలధిముంచి, యిన్నినాళ్ళు గ్రామాంతరముల నుండదగునా? మీరూరలేనప్పుడు గొన్నిభూత ములు నాయంతఃపురంబునుజొచ్చి, నన్ను బెక్కురీతుల బాధించుచుం డెడివి. నేనాభూతములతో వేగలేక నేదినంబునకాదినంబుననే ప్రాణం బునరచేత బట్టియుంటిని. నేడు మీరాకనుగని యెందేనియుదాగియుండ వచ్చునని చెప్పుచుండ మంచముక్రింద దాగియుండిన వినయుండు రాజును భయపెట్టనెంచి మంచముయొక్క నాలుగుకోళ్ళను బలమున

బై కెత్తెను. అంత నిందువర్మ భూతములే యదార్థముగా దన్ను జంప వచ్చెనని భయవిభ్రాంతుండై కెవ్వనయరచి, మరియొకమందిరము లోనికి బారిపోయి తలుపుల బిగించుకొనియెను. అదేసమయమని మదన రేఖ తనమిండగానిని భద్రముగా బయటకు బంపివైచెను. అక్కా! మందారవల్లీ! వింటివా? మదనరేఖకు కలిగియున్నంతటినేర్పును నీకును గలిగినచో నారాజుతో వ్యభిచరింప నరుగవచ్చును. లేకున్న వృధా ప్రయాశనంది, నలుగురలోను నగుబాటందనేల?" యని యాచిలుక చెప్పునప్పటికి జాలప్రొద్దుపోయెనుగాన మందారవల్లి యప్పటికి రాజుతో గూడు తలంపువీడి నిదురించెను.

---

## 4 సువర్ణముఖికథ.



రెండవదినంబున మందారవల్లి రాజునుకూడు కోరికను వీడనిదై చీకటిపడువరకును నెట్లోవేచియుండి, యనంతరము జలతారుచీరను ధరించి, ముఖమలురవికను దొడగి, సర్వాభరణములను ధరించి యపర శృంగారవతివలె దయారై, రాజుకడకుబోవ పయనంబగుచుండ చిలుక యామెనువారించి, యానాడీక్రిందికథను జెప్పదొడంగెను.

"చెలియా! వ్యభిచరించుటయన సామాన్యకార్య మనుకొంటివి. సువర్ణముఖియనునామె వ్యభిచరించియు, యపాయమునందక యెట్లు తప్పించుకొనినదియు నీకు జెప్పెద. సావధానచిత్తవై యాలకించి యట్టి చాతుర్యమును నీవుకూడ సంపాదింపుము.

మున్ను లలితపురంబను పట్టణరాజంబున మాధవసేనుండను భూసురుండుగలడు. అతడు సుశీలయను భార్యవలన మలయవతియను

నొకకుమార్తైను గనియెను. ఆమె యుక్తవయస్కురాలుకాగా, నా విప్రుండామెకు దగినవరుని నిర్ణయించి, వివాహముజేయ నొక్కశుభ ముహూర్తంబును నిర్ణయించెను. ఆ పెండ్లినాటి కెల్లరును నరుదెంచిరి. వివాహ మతివైభవముగా జరుగుచున్న నొక్కసమయంబున నావివా హామున కరుదెంచిన బంధుగులలోనివాడగు గోవిందుడను బ్రాహ్మణు సకు గామముజనించెను. అంతనతడు స్నానమాచరింప దటాకంబున కరుగు నిజభార్యను వెంటాడి, " ప్రేయసీ ! నేడు నేను కామాతు రుండనైతిని. ఇంతమంది బంధుగులలో మనము క్రీడించువిధమెద్దియు గానరాకున్నది " అని పలుక వానిభార్యయగు సువర్ణముఖి భర్తనుద్దే శించి " నాథా ! ఈపాటికార్యమున కింతగా నాలోచింపవలయునా ? నేటిరాత్రి నేను పరుండుతావునందు నాశిరస్థానమునందొక మొక్కల పీటపై దీపము నానవాలుగా బెట్టియుందును. ఆదీపమునుబట్టి ఎల్లర స్త్రీల నడుమనుండు నన్ను గుర్తించి, యాదీపమునార్పివైచి దూర ముగా బెట్టి, నాతో రమింపుము " అనిచెప్ప, నాకామాతురుండును వల్లెయని చనియెను. అట్లు సువర్ణముఖి చెప్పినమాటల నన్నింటిని యొకచాకలివాడు పలుదోముపుల్లలకై వేపచెట్టునెక్కి దానిమీాదనుండి వినెను. సువర్ణముఖియొక్క యందచందములగని యామెనుగూడ కోరిక గలవాడై, యతడు యారాత్రి పెండ్లివారింటికిజని, బ్రాహ్మణునికంటె దానే ముందుగా నెల్లరలోను నిద్రించుచున్న సువర్ణముఖిని శిరస్సు వైపుననున్న దీపపుపీటవల్ల గుర్తించి, యంతకుముందామె భర్తతో చెప్పినప్రకార మాచాకలివాడు దీపమునార్పివైచి, యాపీటను కొంచెము దూరముగానెట్టి యామగువతో గోరికదీర రతికేళిందేలి, నిజ గృహంబున కరిగెను. సువర్ణముఖియు, తన్ను రమించినవాడు నిజభర్తయేయనుకొని యూరకుండి, నిదురించెను. మరికొంతతడవున కామెనిజ భర్తయగు గోవిందుడే యరుదెంచి, తనకు భార్యచెప్పిన తెరంగున

దీపమే లేకుండుటనుగని, యాచీకటిలో తడుములాడుకొనుచు, పెండ్లి కూతురు తల్లిపై బడెను. అంత నామె కెవ్వనయరచి, యెల్లరబంధుగులను లేప, నా బ్రాహ్మణుండు ముప్పువాటిల్లనుండెనని గ్రహించి, తత్క్షణమే యాతావునువీడి, పలాయితుండయ్యెను. అంత నిద్రమేల్కాంచిన బంధుగులెల్లరును నాలుగువైపులను వెదకి, యెవరు లేకుండుటచే నాస్త్రీ నిద్రలోయట్లు కలవరించియుండునని తలంచిరి. ఆమరునాడు గోవిందుడు నిజభార్యనుగని కోపముతో "చాలుచాలు! నిన్ను గుర్తింప దీపపుపీట నానవాలుగా బెట్టుమనని నుడివి, అట్లుచేయక, నన్ను మోసగింతువా? ఇదియేనా మరియాద?" అని కఠినోక్తులాడ సువర్ణముఖి, గతరాత్రంబున దనతో సురతభోగముల నందినవాడు నిజభర్తగాడనియు, దమసాంకేతికము నెవడో యెరింగి తన్నుగూడి పోయెననియు గ్రహించి, తనవ్యభిచారమును రట్టుచేసికొనినయెడల నెల్లరలోను నగుబాటౌదవునని యెంచి, నిజభర్తయగు గోవిందునితో నిట్టులనియెను.

"ఓహోహో! ఏమి తెలివితేటలు! గతరాత్రి పెండ్లివారిదీపములో చమురాఖరై, యది యారిపోయినది. ఆవిషయమును నేను గుర్తించియే మీరాకనుగమనించి, కాళ్ళనున్న యందెలను జప్పుడు చేసితి. మీరధిక కామాతురులై నాయందెలధ్వనినైనను వినిపించుకొనక పెండ్లికుమార్తెతల్లినే రమింపనెంచి, యామెపై బడుట మరియాదగునా? తమరట్లుయవివేకముగా చెరించినదిచాలక యింకను నాపైననే నేరారోపణముజేయుట సాహసముకాదా?" యని తననేర్పు పెంపున మృదువుగా భర్తను మందలించి, తనవ్యభిచారవృత్తాంతమును మరుగుపరచుకొనగలిగెను. ఆమెభర్తయగు నా బ్రాహ్మణుండు, పెండ్లికుమార్తె తల్లికిని దనకును రంకుగట్టుచున్న తనభార్యమాటలకు మారాడజాలక, తనదే పొరబాటని యొప్పుకొని సిగ్గుపడెను.

ఓ మందారవల్లీ! వింటివికదా సువర్ణముఖియొక్క బొంకు నేర్పును. నీకును నట్టిసామర్థ్యము కలదేని రాజుతో గామసౌఖ్యంబుల నంద నరుగుము. లేకున్న నవమానింప బడుదువుగాన యీ ప్రయత్నమును వీడుము" అని యాచిలుక చెప్పునప్పటికి సగమురాత్రికి పైగా గడచిపోవుటచే, మరునాడరుగవచ్చునని మందారవల్లితలంచి యానాటికి దనప్రయత్నమునువీడి, సువర్ణముఖికి వ్యభిచారమునందు గలనేర్పును మనంబున బలుమారు కొనియాడుకొనుచు నిద్రజెందెను.

---

# 5 గుణవర్మకథ.



మూడవనాటిరాత్రి మందారవల్లి బన్నీటజలకమాడి, మృష్టాన్నంబుల భుజించి, యపరరతీదేవియుంబోలె సర్వాభరణ విభూషితయై మలయకేతునితో మన్మధసౌఖ్యములనంద విలాసముగ బయనంబై చనుచుండుసమయంబున బంగారు పంజరములోనున్న మాటలనేర్చిన కీరరాజం బామగువనుగని యిట్లుచెప్పనారంభించెను—

"అక్కా! వ్యభిచారము నాచరించుటలో నెట్టిసామర్థ్యంబును లేని నీవు రాజుతో యోనిసౌఖ్యమునందుటకరుగదగదు. నాచెప్పబోవు కథనాలకించి, యందొక జాణయగు నాయకి యెట్టిచాతుర్యంబున వ్యభిచరించినదియు నెరుంగుము" అని యాచిలుక వైశ్యాంగన కీప్రకారంబున జెప్పుచున్నది.

"తొల్లి కౌముదియను నగరంబున ముకుందుడను రేడు పరిపాలించుచుండెను. ఆతని యాస్థానమునందు గుణవర్మయను బురోహితుడొకడుకలడు. రాజపురోహితునిభార్యయగు కుముదాక్షీమిగుల జక్క

నిది—యౌవనవిలాసిని—యైయుండ నొక్కనాడు రాజసేవకులలో నొక్కడగు, నందుండనువాడా కుముదాక్షీ సౌందర్యమున కచ్చెరువంది యటు వంటిలావణ్యవతిని గూడని తనజన్మవ్యర్థమని చింతించి, బ్రాహ్మణుం డింటలేని యొక్కసమయంబున నాతడు కుముదాక్షి యింటికరిగి, తన యుద్దేశము నామెకెరింగించి, తనతో మదనక్రీడలం దేలుమనికోరెను. అంత నాకాంతయు, నిజభర్తతో సంసారసుఖములందు సంపూర్ణమగు తృప్తినందకుండెగాన, తన్ను వలచివచ్చిన నందునితో యిట్లనియెను.

"నాసామీ! నేను నీయందు మక్కువగలిగి యుంటిని, గాని, మనకార్యమున కిదియదనుగాదు. మంచిసమయమునారసి, నేనే నీకడకరుదెంచి, నీవాంఛితంబును దప్పకనెరవేర్తును. అంతదనుక నోపిక బట్టియుండుము" అన నామాటలకెంతయు సంతసించి, నందుడప్పటికి నిజగృహంబున కరిగెను. కుముదాక్షియు దనప్రియుని రహస్యముగ గూడు నవకాశంబునకై వేచియుండెను.

ఇట్లుండ నొకనాటి తెల్లవారుఝామున గుణవర్మ నిద్దుర మేల్కాంచి, తానానాటి వేకువనే రాజాంతఃపురంబున కరుగవలసియున్న దనియు, జలకమాడ వేడినీటిని బెట్టుమనియు నిజభార్యకుజెప్ప, నామె వల్లెయని, నీరునుమరగబెట్టి భర్తకొసంగెను. ఆ యుడుకునీటిని బోసుకొనజాలక నానిప్రుండు భార్యతోనిట్లులనియెను. "కాంతా! ఈజలంబు లత్యధికోష్ణంబును గలిగియున్నవి. కొన్నిశీతలజలంబులదెచ్చి యిందు గలిపితివేని, యివిసమోష్ణమును గలిగినవౌను". అన నాపడతి యింట జలములేదని, బిందెనుజేతధరించి, బావికనియరిగెను. అట్లరిగిన యాజాణ హుటాహుటిని నందునియింటికరిగి, వానితో గొంతప్రొద్దు రతిక్రీడల దేలి, యనంతరము బావికడకరుదెంచి, చేతనున్నబిందెనందుబారవైచి, ఒకతాడునాధారముగొని, తానును నాబావియందుమెల్లనదిగి, బిందెపై దేలి కూర్చుండెను. తెల్లవారగనే నాగ్రామవనితలెల్లరును జలములగొని

పోవ నాబావికడ కరుదెంచి, యందున్న కుముదాక్షినిగని " అయ్యో! పాపము రాజపురోహితునిభార్య, కాలుజారి, బావిఁబడినది. లేవనెత్తుడు లేవదీయుడు " అని యొండొరుల బ్రోత్సహించుకొని, నూతిలోనున్న కుముదాక్షిని బయటకుదీయ బ్రయత్నించుచుండిరి. ఇంతలో జలంబునకనియేగి, యెంతకురాని తనభార్య యేమయినదోయని పురోహితుండన్నితావులనువెదకి, కడకాబావికడకరిగెను. అటమూగిన జనసమూహంబును. బావిలోబడిన భార్యనుగని మిగులవిచారించి తానుకూడ నచటివారికి సాయపడి భార్యను బావినుండి లేవదీసి నిజగృహంబునకు గొనిపోయి యుపచర్యలంజేసెను.

ఆమె తెప్పరిల్లినయనంతరము బురోహితుండు నిజభార్యంగాంచి " ప్రేయసీ! ఎంత యలసిపోతివి. జలంబులకరిగిన నీవానూతిలోనెట్లు పడితివి ? " యని ప్రశ్నింప, సంకుతనమునుదాచి, యానెరజాణ యిట్లు బొంకెను.

'నాథా ! మీయానతిచొప్పున నేనుజలంబులకై బావికరిగి, చేద నందుదించ, అందున్నజలంబులు త్రాటికందనిలోతునకు పోయియుండెను అంతనేనెట్లయిన కార్యమును సాధింపనెంచి, యానూతివంచనెక్కి, నీరు తోడుచుండ, నందున్ననాబిందెనూతిలోపడెను. అంత దానిని బట్టుకొన బ్రయత్నించిన నేనును నిస్సహాయనై యందుపడిపోతిని. ఎప్పటికేది రానున్నదో మనమెరుంగజాలముకదా ! " అట్లుపలికిన యాచతురమతి యొక్క వాక్యములు సత్యములేయని నమ్మినగుణవర్మ, భార్యకువాటిల్లినకష్టమునకు బలుతెరంగుల వగచి, యెన్నియో సాదరవచనంబుల బలికి యామెనోదార్చెను.

ఓ మందారవల్లీ ! వ్యభిచారమును చేయబోవువనితకు గుముదాక్షికున్నంతటి చాతుర్యంబును, సాహసంబును నుండవలయును.

బొంకనేర్వని నీబోటిముగ్ధలు వ్యభిచరింపబోవుట యవివేకము, గాన యిక నీపిచ్చితలంపును వీడుము" అని యాచిలుక చెప్పి, తనకథను ముగించు నప్పటికి గుక్కుటములు గూయదొడగెను. తన ప్రయత్న మానాటికి చెడియెననియెంచి, మందారవల్లి తన యమూల్యాలంకారముల దీసివైచి మృదుపాన్పునజేరి నిదురించెను.

ఆమరునాడు తిరుగ నావర్తకునిభార్య కేకథను జెప్పవలయునా యని యోజించుకొనుచు, యాచిలుకయు నాబంగరు పంజరమునందె మేనువాల్చి యొక్కింతతడవు కునికెను.

# 6 చంద్రవదనకథ.



చతుర్థరాత్రంబున మందారవల్లి యథాప్రకారంబున గంధ కస్తూరికాది సుగంధద్రవ్యంబుల నలదుకొని, మల్లికచంపకపున్నాగాది వివిధపుష్పజాతులను సిగధరించి, కప్పురవిడియంబు చేధరించి, సుకుమార ములగువలువలధరించి, మలయకేతునితో శృంగార క్రీడలదేల రాజ గృహంబునకు బయనముకాగా, వర్తకుడు వేయివరహాలకు గొన్న శుక రాజంబామెనుగాంచి, "ఓమగువా! నీవనరింపబోవు రహస్యకార్యము గప్పిపుచ్చుకొనుట నీకధికమగు చాతుర్యంబులుండవలయునుగాన నేను చెప్పబోవు కథను సావధానంబున నాలకించు" మని యాకీరంబు మం దారవల్లి కీవిధంబున జెప్పనున్నది.

"మణిపురంబను నగరంబున దేవశెట్టియను నొకవర్తకశిఖామణి కలడు. అతనికి చంద్రవదనయను నొకసుందరాంగియగు భార్యకలదు. ఆమెభర్తయందు మక్కువలేనిదై, శ్రీధరుండనియు, శ్రీకరుండనియు

నిరువురు విటులఁగూడి నిత్యమును రహస్యముగా క్రీడించుచుండెను. ఒక నాఁడామె యత్తమామలు చంద్రవదన కొకరూకనొసంగి, కందులనుగొని రావలయునని యంగడికిఁబంపిరి. గతమాసముదినములనుండియు శ్రీకర, శ్రీధరులను చంద్రవదన ప్రియులూరలేక యాదినంబునవచ్చిరి. అంగడి నుండి కందులగంప నెత్తుకొనివచ్చుచున్న చంద్రవదననుగని, శ్రీధరుండు "ప్రేయసీ! గతనెలదినంబులనుండి మన కెడబాటు కలిగినందులకు మిగులవిచారించితిని. నేఁడయినను దనివితీర కామసుఖంబుల నందితీరవల యును. ఒక్కసారి మాయింటికరుదెంచి మరియుబొమ్ము" అనినుడువ, నామగువయు వలపుగానిమాటను తిరస్కరింపజాలక, వానితో రతిక్రీ డలందేల, వానిగృహంబునకరిగి, కందులగంప నొకమచురుమీఁదబెట్టి, లోన నావిటగానితో సురతభోగంబులనందుచుండెను. ఆమచురునకావల భాగంబుననే నివసించుచుండిన, శ్రీకరుండీవృత్తాంతమునెల్ల నెఱిఁగి, శ్రీధరుండుఁగూడ తనప్రియురాలితోడనే క్రీడించుచుండుట కసూయ జెంది, యారంకులాడికెట్టులయిన నపకారముజేయఁదలంచి, యాగంప లోనికందులన్నిటినిదీసికొని, వాటికిబదులుగా నాగంపనిండ మన్నునుబోసి చనియెను. అనంతరము చంద్రవదన శ్రీధరునితో గామసుఖంబులనంది, కందులగంపలో నిసుకయుండుటను గనకయే దానినినెత్తినిడుకొని చని యెను.

నిజగృహంబునకరిగి, యత్తమామలయెదుట గంపను దింపి చూడఁగా, నందు గందులకుబదులుగా మన్నునుగని యెల్లరు నాశ్చర్య పోయిరి. అంత నాయత్తమామలు కోడలిపై గోపించి, "ఏమే ఈగంప నిండ నీ యిసుకయేమి? కందులకొనలేదా?" యని దండించి యడుగ నామె నేర్పుననిట్లుబొంకి, తనరంకుతనముబయటబడకుండజేసుకొనియెను.

"అత్తమామలారా! నేనుకందులకై యంగడికరుగుచుండగ, చేతనున్నరూక నేలపై బడిపోయెను. ఎంతవెదికినను నదిగానరామిచే, నది

పడియున్న తావునంగలయిసుకనంతయు నీగంపలోనెత్తి స్థిమితముగాజూచు కొనవచ్చునుగదాయని, యిటకుగొనితెచ్చితిని ".

ఆమాటలవినిన నాయత్తమామలు కోడలివాక్యము లెదార్థములే యనియెంచి, యిసుకను క్రిందనొలకబోసిరి. కాని రూకకనుపించలేదు. ప్రమాదవశంబునబడిన నారూకయెందో దొర్లిపోయియుండుననియెంచి, వారామె నేమియుజేయక మిన్నకుండిరి. ఓవైశ్యసతీ! నీకాచంద్రవదన కున్నంతటి బొంకునేర్పు నీకడలేదుకాబట్టి రాజుతోరమింపనరుగు ప్రయత్నమునుమానుము " అనియా చిలుకచెప్పునప్పటికే యూరు మాటు మణుగుటచే, మందారవల్లి నాటికిదన ప్రయత్నమునువీడి నిదురించెను.

---

# 7 జగన్మోహినికథ.



అయిదవరాత్రంబునమందారవల్లి సకలామూల్యవస్త్రాభరణాలంకృతయై సరేంద్రుండగు మలయకేతునితో రహస్యక్రీడలదేలి, కామ బాధ నుపశమించుకొనవలయునని, పయనంబై చనుచుండ,నటపంజరమున నున్న కీరమామెనువారించి, " అక్కా! నీవుచేయబోవునది వ్యభిచార కార్యము. ఇక్కార్యము నీనిజనాథుండెరింగెనేని మోసమురాదా?అతని కేమని సమాధానముజెప్పి రంకుతనమును మరుగుపరుపగలవు? అందులకు ప్రబలచాతుర్య ముండవలయును. అట్టిసామర్థ్యంబు నీకడలేదు, గాన జగన్మోహినియను జాణ, తననేర్పుపెంపున నెట్లుబొంకి, తనదుశ్శీలనమును గప్పిపుచ్చుకొనినదియు, దెలుపు నొకకథనుజెప్పెదును. ఆకథను నీవాలకించి, నీవును నట్టిచాతుర్యమును సంపాదించిన యనంతరమే రాజుతో రతిక్రీడలదేల నరుగుము "

అని శుకరాజంబు మందారవల్లికొకకథ నీప్రకారంబుగా జెప్పుచున్నది—

తొల్లి అమలపురంబను నొకపట్టణమున శోమిశెట్టియను నొక వైశ్యశ్రేష్ఠుండుగలడు. అతడు రామేశ్వరయాత్రనరుగదలచి, నిజ భార్యయు, లోకోత్తరలావణ్యవతియు, నగుజగన్మోహినియను కాంత తోడను, మిత్రుడగు బంగారుశెట్టియను మరియొక వైశ్యునితోడను,తీర్థ యాత్రాగమనంబునకై బయనంబాయెను. అట్లావైశ్యదంపతులుమిత్ర సహితులై రామేశ్వర పట్టణంబుజేరి, యందొకసత్రమునందుబసజేసిరి. ఒకనాటిరాత్రిసమయంబున నాముగ్గురును వేరువేరుప్రక్కలపై సత్ర మునందునిదురించుచుండిరి. పుణ్యక్షేత్రాగమన సమయములందు పడ తులగూడిన పాపమనియెంచి, శోమిశెట్టి నిజభార్యనుగూడక యాదినంబు లందు నాతిగల బ్రహ్మచర్యము నవలంభించియుండెను. అట్లారేయి నిద్రించు ముగ్గురలోను బంగారుశెట్టిమెళుకువనంది యధిక కామపీడుతు డయ్యెను. అంతనతడు తనమదనతాపము నడంచుకొన మిత్రునిభార్య యగు జగన్మోహినితో రమింపనెంచి, మెల్లనలేచి, యట వెలుగుచున్న దీపమునార్పివైచి, చల్లగాపోయి జగన్మోహినిప్రక్కలోజేరి,యామెతో సంభోగింపదొడంగెను. అంతనాతరుణియు నాచీకటిలో దన్నుగూడుచు న్నవాడు నిజభర్తయేయనుకొని వానికెట్టి యభ్యంతరమును బెట్ట దయ్యెను. అట్లుకొంతతడవు కామభోగంబుల దృప్తుడై బంగారుశెట్టినిజ శయ్యంజేరి నిదురించెను.

ఆమరునాడు ప్రస్తావనావుసరంబున జగన్మోహిని నిజభర్తంగని "నాధా! పుణ్యతీర్థములందు పడతినిగూడిన పాపమంటిరే. గతరాత్రి బున నట్లుచేసి, వ్రతభంగమొనర్పదగునా?" యని హేళనజేయు శోమికెట్టితెల్లబోయి, "నిన్నటిదినంబుననేను నిన్నుగూడితినా? ఎందుల

కట్లులేనిపోని కల్లలాడెదవు. నావలెనే నెవ్వడో పరపురుషుడు నీతో రమించి పోయియుండనోపు " అన, నాజగన్మోహినియు నాశ్చర్యమంది, గతరాత్రంబున దన్ను గూడిన యతడు నిజభర్తగాక, బంగారుశెట్టియే సాహసమునట్లు దనతో గ్రీడించెననియెరింగి, నిజవృత్తాంతము భర్త కెరిగించిన, నతడు ఖిన్నుడగుననియు, దనయవివేకమును దూలనాడు ననియునెంచి, " నాథా! స్వప్నములుకూడయదార్థముగాజరిగినట్లేయుం డునుసుమీ! గతరాత్రంబున నేనెడమచేతిని వక్షస్థలమునపడుకొని నిదు రించుటచే, నేనొకచిత్రమయిన కలనుగంటిని అందేమందువేని, నీవు నాశయ్యజేరి, చెక్కిలిముద్దాడి, యధరమును మునిపండ్లనొక్కి, పాలిండ్ల నొత్తి రతికేళిసల్పి, నన్నానంద సాగరమున నోలలాడించితివట. స్వప్న ములో జరిగిన యీసర్వకార్యములును యదార్థముగా జరిగినట్లే యుం డెనుసుమా! " యని తనచాతుర్యమున నొకకపటవృత్తాంతమును గల్పించి, భర్తతోజెప్పి, యాతనినినమ్మించెను. అతడామె స్వప్నవృత్తాం తము నిజమేయనుకొని, నిజభార్యతో నిట్లుచెప్పెను. " ప్రేయసీ! యదార్థవిషయమదియే, గాని నేను నిన్నుగూడియుండలేదు. స్వప్నవిష యములన్నియు నెదార్థముగా జరిగినట్లేయుండుటనిజము ".

" ఓమందారవల్లీ! చమత్కారమనినజగన్మోహినిదేచమత్కారము అట్టిసామర్థ్యంబున కల్లలాడి, పురుషుని నమ్మించుశక్తి నీకడ లేదుగాన నీకార్యమును వీడుము. లేకున్న నీపతి నిన్నారడిజేయును. వ్యభిచారము జేయబూనువారు ముందుగా గల్లలాడునేర్పును సంపాదింపవలయును "

అనిచిలుక జెప్పునప్పటికి గడియారమునాలుగుఃకొట్టెను. తెల్లవా రుటకింకను రెండుగంటల వ్యవధియేయుండెగాన, మందారవల్లి, నాటికి దనప్రయత్నమునువీడి- జగన్మోహినియొక్క బొంకునేర్పును, వ్యభిచ రించుటలో నామెకుగల చతురతను, మనంబున బలుతెరంగుల దలపో యుచు నిజపానుపంజేరి సుఖనిద్దురంజెందెను.

---

# 8 గుణమంజరి కథ.



ఆరవనాటి రాత్రంబున మందారవల్లి యథాప్రకారంబు బన్నీటజలకమాడి, వివిధాభరణముల నలంకరించుకొని, చీని చీనాంబర ధారియై, నుదుటకస్తూరి తిలకంబుదిద్ది, పాలిండ్లకు బులుగు జవ్వాజి మొదలగు సుగంధద్రవ్యంబులరుద్ది, పుడమి నవతరించిన దేవాంగన యోయనునట్లు సింగారించుకొని, రాజగృహంబున కరుగుటకు బ్రయత్నించుచుండగా నచటనున్న చిలుక యామదనవతినిగని "అక్కా! రాజుతో వ్యభిచరింప నేగుచున్న నీకుచాతుర్యమెంతమాత్రమునులేదు సుమా! చాతుర్యసామర్థ్యంబులు లేక వ్యభిచరించువారు చిక్కులకు లోనగుదురు. గుణమంజరియను కాముకురాలు తనజాణతనము నెట్లు భర్తనుమోసబుచ్చి, పరపురుషునితో గామసుఖంబులనంది జయము గాంచినదియు నేనునీకుజెప్పెద. నీవద్దానినాలకించి,కొంతచతురతనునేర్చుకొని మరియు వ్యభిచరింపనరుగుము"

అని యాశుకరత్నంబు మందారవల్లితో నీవిధంబుగా గుణమంజరి కథను జెప్పుచున్నది.

"తొల్లిచంగల్వ నగరంబను పట్టణంబున వాసుదేవుండనుపూజారికలడు. అతనికి నవయావనాంగియు, రూపవతియునగు గుణమంజరి యనునొక భార్యకలదు. ఆమెవృద్ధుడగు నిజభర్తయం దనురాగము లేనిదై, యెవడైన సుందరయావన పురుషుండు లభించినచో, వానితో గామసుఖంబుల నంది తనివితీర సుఖంబునందజూచుచుండెను. కానిచండ శాసనుండగు వాసుదేవుని కట్టడిచే యామగువకోరిక నెరవేరుటకవకాశ ములభింపకుండెను.

ఇట్లుండ, గుణమంజరి యొకదినంబున జలంబులకై యాగ్రామము నంగలయొకపద్మాకరమునకరిగి, జలకమాడుచుండు సమయంబున మదన

సేనుండను బ్రాహ్మణుండు గూడ నాతటాకమునందే స్నానముచేయు చుండెను. గుణమంజరి వాని యౌవనసుందరరూపంబులగనివానితో నెట్లయిన మదనక్రీడలందేలి పుష్పశరునిబారినుండి దప్పించుకొన కృతనిశ్చయై తనక్రీగంటి చూపుల నాబ్రాహ్మణకుమారునిపై బరపి, యాతనికిగామమునుబుట్టించెను. అంతనాయువకుండును మన్మథ బాధకు తాళజాలక గుణమంజరిని డాయంజని, తనకోరిక నామెకెరిగించి, యెట్లయిన దన కోర్కెను దీర్చుమనియెను. అంతనా మదవతి కోరికగూడ నదియేగాన, నామె వానికిట్లనియెను. " ఓ మోహనాకారా ! నీకునునావలెనె పుష్పశరునిబాధయధికముగనున్నది. కానినాభర్తకడుక్రూరుడు. అతడేరహస్యమునెరింగెనేని, మనయిరువురనుగూడ బ్రతుకనియ్యడు. మనమతనినెట్లయిన మోసపుచ్చి, మనకామమును దీర్చుకొనవలయును. అందులకు నేనొక యుపాయము నాలోచించితినిలెమ్ము. నీవేమియుభయపడకనాతో మాయింటికరుదెంచి, నేనుచెప్పినట్లెల్ల నాచరించుము. మనకోరిక దీరగలదు. " ఆమాటలకా విప్రనందనుండు వల్లెయని గుణమంజరితో నామె యింటికి జనియెను.

అట్లు కామశరపీడితయైన గుణమంజరి విప్రకుమారుని వెంట నిడుకొనిపోయి నిజభర్తంగని, " నాథా ! ఈమహానుభావుండు సర్వ వేదాంతమార్గముల నెరింగిన పుణ్యాత్ముండు–సకలశాస్త్ర నిపుణుండు సర్వవిద్యాపారంగతుడు. ఈలోకోత్తరపురుషునకు మనమాతిథ్యమిచ్చి, మనజన్మల దరింపజేసికొందము " అని నుడువ, నామెభర్తయు నామె మాట లెదార్థములనియెంచి, మదనసేనునకు సకలవిధ సత్కారముల నొసరించి, మృష్టాన్నభోజనమునిడి, దక్షిణతాంబూలాదుల సమర్పించుకొని, నమస్కరించి, " దేవా ! తమరు మాయింట మరిరెండురోజులు విశ్రమించి, మాస్వల్ప యతిథిసత్కారముల స్వీకరించి, మమ్ముల నానందింపజేయు " డనివేడ, నావిప్రుండు తొలుతనందులకు నమ్మ

తింపనివానివలె నటింపుచు, యనంతరము గుణమంజరి పొంజ్ఞను గ్ర
హించినవాడగుటచే, వాసుదేవునికోరికను నెరవేర్చుట కంగీకరించి,
యందుండెను.

ఆరాత్రి ఆయతిథికి బయటవరండాలో ప్రక్కనేర్పాటుచేసి
వాసుదేవుండును, గుణమంజరియు దమకేళీగృహంబున నేకశయ్యా
గతులై సరున్నసమయంబున గుణమంజరి నిజభర్తనుగని "నాథా!
పొరుగుననున్న పడతులెల్లరును రానున్న శ్రావణమాసమున కెన్నె
న్నియో యాభరణముల జేయించుకొనిరి. మిమ్ముల గట్టుకొనబట్టి
నాకొక్కనగయైనను లేదుకదా! అంత చేతగానివారును, భార్యలకు
సొమ్ముల జేయించలేనివారును బెండ్లిండ్లాడుటెందులకో!" యని
యనేకములయిన యెత్తిపొడుపుమాటలనాడ, నామెభర్తవిసిగి, యామె
పైగినిసి "ఛీ! ఎప్పుడును నీపోరిట్లేయుండును. నానిద్దురగూడ పాడు
జేయుచుంటివి. ఆవలకుబొమ్ము" అని యామెను గదినుండి యావ
లకు గెంటివైచి, తలుపుదు బిగించుకొని యథేచ్ఛగా సుఖనిద్దురం
జెందెను. అంత గుణమంజరియు దనపాచిక పారినందులకెంతయు సంత
సించి, యావరండాలో బండుకొనియున్న విప్రకుమారుని శయ్యజేరి
తనివిదీర వానితో మన్మథక్రీడలందేలి, యనంతరము తలుపుల దెరచు
కొని రచ్చకెక్కి నలుగుర పెద్దమనుష్యులను గొనివచ్చి, కోపించి గది
తలుపులు మూసికొని నిదురించు భర్తంజూపి, "అయ్యలారా! నా
పతియొక్క చెడునడతను దిలకింపుడు. ఈయర్థరాత్రంబున భార్యనగు
నన్ను బయటకు గెంటివైచి, యెవరో పరకాంతతో తలుపులు బిగించు
కొని రహస్యముగా గ్రీడించుచున్నాడు. నాదీనతను గమనించి,
మీరైన వానికి బుద్ధిచెప్పుడు" అని వేడ నాప్రజలు వాసుదేవుని
బిలచి అర్థరాత్రంబున బరకాంతతో గూడుటకై నిజభార్యను వీధి

లోనికి గెంటివైచుట తగదని పలువిధంబుల దూలనాడిరి. అంత నా వాసుదేవుండును తనభార్యచేసిన యవమానమునకు సిగ్గుపడి యూరకుండెను. ఆమరునాడు గుణమంజరితో క్రీడించిన విప్రకుమారుండును దనకామము దీరినందులకు సంతసించి, నిజమార్గము ననుసరించి చనియెను.

ఓమందారవల్లీ ! రంకునేర్చినయమ్మ గుణమంజరివలె నట్లుబొంక నేర్వవలయును అని ఆచిలుక చెప్పునప్పటికి మందారవల్లి నిదురనాపుకొనజాలక " ఓ శుకరత్నమా ! నీనుడువులెంతయు యెదార్థంబులు. వ్యభిచరించుటలో నత్యధిక చాతుర్యముండి తీరవలయును. ఇకనాకు నిద్దుర వచ్చుచున్నది. ఈనాటికిక రాజమందిరమున కరుగజాలను " అనిచెప్పి, నిజతల్పంబునుజేరి సుఖనిద్దురం జెందెను.

# 9 క మ లా క్షి క థ.



మందారవల్లి రాజుతో గామసుఖంబుల నందవలయుననెడి యాశ తీరనిదై సప్తమరాత్రంబున దొల్లింటివలెనే సర్వవిధంబుల నలంకరించుకొని, ముద్దులొల్కు మందగమనంబున రాజగృహంబునకు బయనంబై చనుచుండ, పసిడిపంజరమునందున్న చిలుకలరాజా మగువనుగని " ఓ యమ్మా ! రంకుపని కరగుచున్న నీకేమాత్రమును బొంకునేర్పులేదు. కమలాక్షియనుజాణ యెట్టినేర్పుతో నిజభర్త కన్నులగారముగొట్టి, రంకుమగని గూడినదియు నేను నీకెరింగించెద. సావధానచిత్తవై యాలకించి, నీవును నట్టినేర్పునుసంపాదించి, మరియు వ్యభిచరింప నరుగుము " అని వెండియు నాశుకమణి మందారవల్లికి ప్రకారంబుగా గమలాక్షి కథను జెప్పనారంభించెను.

"తొల్లి యవంతీనగరంబును ఈశ్వరదత్తుండనురాజు పరిపాలించుచుండెను. అతనికుమారుడగు విక్రమసింహుడు విద్యాబుద్ధుల నొల్లక సోమరియై దిరుగుచుండ, వానితలిదండ్రు లాతనిబిలచి యొక దినంబున "కుమారా! నీవు విద్యావిహీనుండవై, మాకెల్లరకు నవమానమును జేకూర్చుచుంటివి. నీవు కొంతకాలము దేశాటనమొనర్చిన యెడల గొంత ప్రపంచజ్ఞానమైనను కలుగును. కాన, నీవీనాడె గృహంబునువీడి, నానాదేశంబుల దిరిగిరమ్ము" అనిచెప్ప, నారాజకుమారుండును వలసినధనమునుగొని, దేశసంచారమునకై యరిగెను.

ఆరాజకుమారుండట్లుపోయి, కాశీ, రామేశ్వరము, కంచి, కాళహస్తి మొదలగు నెల్లతీర్థంబులను సేవించి, కొంత లోకజ్ఞానము నలవడజేసికొని నిజపురాభిముఖుండై జనుచు, మార్గమునంగల యొక పుష్పలతా నికుంజనంబుననాగి, యాయుద్యానవన రామణీయకంబును గనుచు, శ్రమను దీర్చుకొనుచుండు సమయంబున, నావనకాపరి కుమార్తెయగు కమలాక్షియనుచిన్నది యారాజకుమారునిగని మోహవివశతయై తన్నుగూడి మన్మథతాపమును దీర్పుమనివేడ, నాయువకుండును నామెలావణ్యమునుగని కామాతురుండై, యాపుష్పలతానికుంజమునందు దనివితీర రతిక్రీడల దేలుచుండు సమయంబున, నామె భర్త యటకరుదెంచుచుండెను. అతనింగాంచిన కమలాక్షి భీతచిత్తయై గడగడవణకుచున్న విటునిగని, "ఓనాయకా! భీతిల్లకుము. నేను చెప్పినతెరంగున నాచరించితివేని, మనమెట్టియపాయంబునులేక దప్పించుకొనగలము. నానిజభర్త యిటకరుదెంచిన క్షణమందె నీవు కత్తిని త్రిప్పుచు వానికి భయంబునుగొల్పుము. అతడు తెరవుగానక నిన్ను గొట్టుటకై యాయుధమును వెదకుకొను తరుణంబుననీవు పారిపొమ్ము" అని చెప్పునంతలో కమలాక్షిభర్త యటకరుదెంచి, పరపురుషునితో నున్న భార్యననుమానించుచుండు సమయంబున, నామగువ యమాం

తముగా శయ్యనుండియురికి క్రిందబడి భయమును నటించుచుండ, నా రాజకుమారుండామె చెప్పినతెరంగున కత్తి ఝుళిపించుచు, "ఓరీ దురాత్మా! నీవు కండకావరముచే మెలంగుచున్నావు. జాగ్రత్త!" యని పారిపోయెను.

అంత గమలాక్షిభర్త సతినిజూచి "ప్రేయసీ! ఇదియేమి వింత? ఇతడెవ్వడు?" అని భయవిభ్రాంతుండై యడుగ, నాచతుర మతియు భీతిని నటింపుచు "నాథా! నేనీవనమున పుష్పశయ్యపై బరున్నసమయమున నీపురుషమూర్తి యిటనవతరించి, "నేను తిరుపతి వెంకటేశ్వరుండను. నాకొండకెక్కుదునని మ్రొక్కుకొనిమరచితివా?" అని కత్తిని ఝుళిపించుచుండగా మీరరుదెంచినారు. నేనింతకుముందా సామికి మ్రొక్కుకొనుటయు, నామ్రొక్కు దీర్పకుండుటయు నెదార్థ విషయంబేకదా!" యని నుడువ నామెభర్త యామెచెప్పినదెల్ల విశ్వ శించి, యామరునాడె మ్రొక్కును దీర్చుకొన భార్యాసహితుండై తిరు పతిక్షేత్రమున కరిగెను.

"ఓ మందారవల్లీ! వింటివా కమలాక్షియొక్క జాణతనము! అట్టి చతురబుద్ధియు, గల్పనాచమత్కృతియు నీకడగలవా? లేకున్న రాజగృహంబున రహస్యక్రీడలజరుప నేలజనుదువు?" అని యా శుకంబు కథనుజెప్పినయనంతరంబు మందారవల్లితోనన, నప్పటికి తెల్ల వారుచిహ్నంబు లాకశమున గనుపింప, నాకాముకి నాటికి దనప్రయ త్నమునువీడి నిదురించెను.



# 10 మృణాళినికథ.



ఎనిమిదవనాటి సాయంసమయంబున మందారవల్లి మృష్టాన్న భోజనమొనరించి, సర్వాంబరాభరణ విభూషితయై, నవసౌరభసమంచిత కుసుమంబుల సిగదాల్చి, మలయకేత మహారాజుతో గామభోగసాగర తరంగడోలికల దేల నుత్సాహంబున నరుగ సంసిద్ధురాలగుచుండ చిలుక యామెనుబిలచి, "ప్రియసఖీ! జారత్వమునొనరించుటకు వలసిన చాతుర్యంబు నలవడజేయు నొక్కయితిహాసంబును నీకుజెప్పెద నాల కింపుము" అని వెండియు నిట్లు చెప్పమొదలిడెను.

"ఓమందారవల్లీ! మున్ను కుండినగరంబను పట్టణంబున విష్ణుదత్తుండను నొకఛాందసబ్రాహ్మణుండుగలడు. అతడు చతుర్వేదంబులను, నష్టాదశపురాణంబులను, సర్వశాస్త్రములను నభ్యసించి. శిష్యగణంబుతో పుణ్యకాలక్షేపము జేయుచుండెను. ఆవిప్రవరేణ్యునకు మృణాళినియను నొక సౌందర్యోపేతయగు భార్యకలదు. ఆమ గువ యాఛాందసుడగు విప్రునితో గామభోగంబుల దృప్తినందజాలక యాతని శిష్యకోటిలో నొక్కడగు వినయశీలుండను విద్యార్థిని రహస్యముగగూడి రతిసౌఖ్యంబుల నందుచుండెను.

ఒకనాటి యుదయంబున నాబ్రాహ్మణుండు శిష్యకోటికి వేద పాఠంబుల జెప్పుచు శయనగృహంబుననుండు 'వ్యాకరణ చింతామణి' యను తాళపత్రగ్రంథమును దెమ్మని వినయశీలుని బంపెను. అప్పు డధికకామమును గలిగియున్న మృణాళిని తాళపత్రగ్రంథమునకై శయనగృహంబున కరుదెంచిన వినయశీలుని విడువక ద్వారమునుబంధించి, యపుడు దన్నుగూడి కామమును దీర్పుమనియెను. అంత నా యువకుండును నామదవతినిగూడి రతికేళింతేలుచు, గురునాజ్ఞ నెరవేర్ప తడవుజేసెను. అంతనాగురువు, శిష్యుడెంతకును రాకుండుటచే నను

మానపడి, శయనగృహంబునకరిగి, మూయబడియున్న తలుపునుదట్టి పిలచెను. లోన గురుభార్యతో మదనక్రీడల నోలలాడుచుండిన వినయశీలుండు భయవిభ్రాంతుడై తల్లడిల్లదొడంగ మృణాళిని వానింగని, "మనోనాయకా! మనకెట్టి ప్రమాదమును రాకుండజేసెద. విచారింపకుము" అని వానికి ధైర్యము గొలిపి, యటనున్న తాళపత్రగ్రంథమును ఏపత్రమునకాపత్రము నూడదీసి గదియంతట నా పత్రముల విరజిమ్మి, యనంతరము గదితలుపులదెరచి, భర్తనుగని నవ్వుచు, "నాథా! మీశిష్యుడు తాళపత్రగ్రంథమును దెచ్చుచు, దానిని ప్రమాదవశంబున గ్రిందజారవిడిచినాడు. దానంజేసి యా పత్రములన్నియు చెల్లాచెదరయ్యెను. ఈవృత్తాంతమును మీరెరింగిన గోపింతురని తలుపునుమూసి, జాగ్రత్తగా యాపత్రములనన్నింటిని సేకరించి కట్టనుగట్టుచున్నాడు. దానంజేసి యతడు మీకడకరుదెంచ జాగయ్యెను. మీరేమందురోయని యీబాలకుండతిభీతుడై యున్నాడు. ప్రమాదవశంబున గలిగిన వీనినేరమును క్షమించి, దయజూడుడు" అని యధికచాతుర్య మొప్పనట్లుబలుక నాగురుండు శిష్యునకు దన యెడగల వినయవిధేయతల కెంతయు సంతసించి, "ఈమాత్రము దానికే యింతభీతిల్లవలయునా?" అని, యనంతరము గ్రంథసహితముగా శిష్యునిదోడ్కొని యరిగెను.

"మందారవల్లీ! వింటివిగదా మృణాళిని చాతుర్యము. వ్యభిచరించుటలో సామర్థ్యంబనిన నట్టిదేసుమీ! తన కల్పనాచమత్కృతిం జూపి, మృణాళిని యెట్లపాయమును దప్పించుకొనెనో చూడుము. అట్టిశక్తి నీకడలేదుగాన నీప్రయత్నమును వీడుము" అని చిలుక చెప్పునప్పటికి లోకజ్ఞానియగు కోడికూయ, నిద్రాభరంబున మందారవల్లి నిజతల్పంబున జేరెను.

---

# 11 కాంతిరూపిణికథ.



తొమ్మిదవరాత్రంబునగూడ మందారవల్లి మలయకేతనరేంద్రు నితో సురతభోగంబుల నందవలయునని దృఢేచ్ఛగలదై, సుప్రశస్తశ్వే తాంబరధారియై, వివిధామూల్య రత్నాభరణములధరించి, రాజగృహం బున కరుగ నుత్సాహంబున బయనంబగుచుండ యటనున్న కీరమణి యామెనువారించి "నాయనుంగు నెచ్చెలీ! రంకునేర్చినయమ్మబొంకనేర్వ వలయుననెడి సామెతను నీవు వినియుండలేదా? అట్టిసామర్థ్యంబును గలగకయుండియు, నీవాజారత్వ కార్యమును నెరవేర్ప జూచుట ప్రమాదకారణముసుమా! నేనిప్పుడు చెప్పబోవు కాంతిమతి కథను గూడ నాలకించి, మరియుబొమ్ము." అని యాచిలుకలరేడు మందార వల్లికిక్రమంబున జెప్పదొడంగెను.

"మున్ను అలకాపురియను పట్టణమున ననంతవర్మయను బ్రాహ్మ ణుండు రాజపురోహితుడై యధికగౌరవమునందుచుండెను. ఆవిప్రునకు జగదేక సుందరియు, నవయౌవనాంగియునగు గాంతిరూపిణియను నొక చక్కనియిల్లాలుగలదు. ఆమె యొకదినంబున జెరువునకరిగి ఘటంబుతో జలంబుల గొనివచ్చుచుండ మార్గమునందొక పల్లెయువకుడామెకు గను పడెను. అంతనామె ఆయువకునిశరీరపటిమనుగని మోహించి, యతనిగూ డనితనజన్మ వృథయనుకొని, తనయభిప్రాయము నాతని కెట్లెరింగించు టయాయని యోజించుచుండ, నంతకుముందే పురోహితునిభార్యను మోహించి, చిరకాలమునుండి భగ్నమనోరథుడగుచున్న నాపల్లెయువ కుండామె హృదయమును గ్రహించి, "ఓమోహనాంగీ! నీచంచల దృక్కులు నీవలపును జెప్పకయే జెప్పుచున్నవి. నేను బహుకాలము నుండి నీయందు బద్ధానురాగుండనై నిన్నుగూడనేరక మిగుల విచా

రించుచుంటిని. నేడే దైవికంబుగా నీకూటమి గలిగినది. మనకోరిక నెరవేరు యుపాయంబునుజెప్పి పుణ్యముగట్టుకొమ్ము" అన నామగువ వానింగని "సుందరాకారా! నామగడు పొలమునకరిగినాడు. సాయంకాలమువరకునురాడు. నేనుముందుగా మాగృహంబున కేగుదును. అనంతరము నీవు రహస్యముగా మాదొడ్డిలోని చిక్కుడుపాదువద్ద వేచియుండుము. అంతట నేనరుదెంచి, నిన్నుగూడుదును" అనిచెప్పి తాను ముందరిగెను. అనంతర మామెచెప్పినట్లే యాపల్లెవాడు పరికిని దెలియకుండ గోడనుదూకి, చిక్కుడుపాదులో డాగియుండెను. అంత గాంతిరూపిణియు తలుపుల నన్నింటినిబిగించి, చిక్కుడుపాదులో రంకుమగనిగూడి కామసుఖంబుల నందుచుండెను. ఆనాడెండ మిక్కుటముగా నుండుటచే పొలమునుండి సాయంకాల మరుదెంచవలసిన విప్రుండా నాడు మధ్యాహ్నమే యొకతుమ్మమొద్దును భుజములపై మోసికొని, యుస్సురనుచు నిజగృహంబునజేరి, మూయబడియున్న తలుపునుదట్టెను. అంత, లోన రతికేళిదేలుచున్న కాంతిరూపిణి ప్రమాదము రానున్నదనియెంచి తలుపునుదీసి, భర్తనుగనినంతనే తలను విరియబోసికొని, మండిపడి శివద్రొక్కుచు "ఓరీ! దుర్మతీ! పిశాచనాయకుండనగు నేను నివసించు తుమ్మకర్రనుగొట్టి తెచ్చితివా? చూడుమిదే నిన్ను మ్రింగెదను" అని తాండవమాడ, నాబ్రాహ్మణుండామెకు దయ్యము పట్టినదనుకొని, యాక్షణమునందే యాతుమ్మకొమ్మను దిరుగపొలములో పారవేయుటకు బరుగెత్తెను. అదే సందనుకొని చిక్కుడుపాదులో నక్కియున్న విటుడు బ్రతుకుజీవుడాయని పలాయనయంత్రమును బఠించెను. మందారవల్లీ! చాతుర్యమనిన నట్లుండవలెను. నీవును నట్టిశక్తిని సంపాదించిన యనంతరమే వ్యభిచరింపుము అనిచెప్ప నప్పటికి నిద్ర వచ్చుటచే మందారవల్లి మృదుతల్పంబుజేరి నిదురించెను.

---

# 12 హైమవతి కథ.



పదవనాటి రాత్రంబున మందారవల్లి తొల్లింటివలె సుకుమార వస్త్రంబులధరించి, కామభోగంబుల నందుటకు దగినట్లలంకరించుకొని, రాజాంతఃపురంబున కరుగనున్న సమయంబున శుకప్రభుండామెనుగని "సఖీ! నేడు నీకు హైమవతియను నెరజాణ వృత్తాంతమును జెప్ప దలంచితిని. సావధానవై యాలకించి మరియు నీయిచ్ఛానుసార మరుగు" మని, యామెకిట్లు చెప్పుట కారంభించెను.

"విజయపాలుండనురాజు మున్నొకప్పుడు వినుతగిరియను పట్టణమునకు ప్రభుండై ప్రజాపాలనంబు చేయుచుండెను. ఆరాజునకు సౌందర్యమున రతీదేవి కెనయనదగు హైమవతియను నొక భార్య కలదు. ఆరాజు భార్యయం దధికమైన యనుమానము గలవాడగుట చే నామె నెల్లప్పుడు లోనబంధించి సాయుధుడగు నొక భటుని గాపుంచుచుండెను. ఆమగువకు గట్టడి యధికమైన కొలదియు గామమును, దానితోబాటు పరపురుషాపేక్షయు నధికము కాజొచ్చెను.

ఇట్లుండ సోముండనుచాకలి యనుదినంబునను రాజుగారికి బట్టలుతుకుచు నొకనాడు ప్రమాదవశంబున హైమవతినిగని యామె యందు మోహముగలవాడై, నిరుపేదనగు దనకురాజుభార్య పొందెట్లు కలుగునాయని పలువిధంబుల విచారించుచు, నామగువచీరలను రాజుగారివస్త్రములను నతినేర్పున చలువజేసి యిచ్చుచుండెను. అంత నొక సమయంబున హైమవతి నిజభర్తంగని "నాధా! మనచాకలివాడు బట్టల నతినేర్పున బాగుచేయుచున్నాడుకదా! వానినేర్పునకు దగినట్లు మనము వానిని సత్కరింపవలదా?" యని నుడువ, నారాజామె

చెప్పినది వాస్తంబెయని, యొకనాడా చాకలివానిని బిలిపించి, "ఓరీ! నీనేర్పునకు మేమెంతయు సంతసించితిమి గాన యీరత్నాలహారమును బహుమానముగా గైకొనుము" అని యొక హారము నీయబోవ నతడు దానిని దీసికొనక, "మహాప్రభూ! పేదవాడనగు నాకీహారములును మణులును నేల? వలదు" అన, నాభూపతి "అట్లయిన మరి దేనినైన గోరుకొనుము" అన, నాచాకలివాడు, "దేవా! అమ్మగారిచేతి ప్రసాదంబును దినవలయునని నాకు బహుకాలమునుండి కోరికగలదు. ఆయమ్మ చేతికూడును భుజించినవారికి సకలదరిద్రములును వీడునని బలువురు చెప్పగా వింటినిగాన నాకామెచేతి యన్నము లభించునట్లు చేయుడు" అన, నారాజది యేపాటి ఘనకార్యమని, భార్యనుబిలచి, చాకలివానికోరిక నామెకుజెప్పి, వంటకములజేయించి చాకలివానినొకపీఠపై నాశీనుంజేసి, యొకఘటముతో జలమునటబెట్టించి యొకవిస్తరి వైపించి, యట రాణి వానికి గనపడకుండునట్లు గొన్ని తెరలు గట్టించి, యామెను వడ్డింపుమనియెను. అంత నాహైమవతియు మందగమనంబున నరుదెంచి, తెరచాటుననుండి చాకలివానికి వంటకముల వడ్డించుచుండ, నటనున్న జలపూరిత ఘటమునందామెకు వాని ప్రతిబింబము గానుపింప, నామె వానిసౌందర్యము నాఘటమునందు గని మోహాపరవశురాలయ్యెను. హైమవతి ప్రతిబింబమునుగూడ నాచాకలివాడు ఘటమునందేగని మరింత పరవశుడాయెను. అట్టిరూపవతిని గూడజాలక పోతినిగదా యని చాకలివాడును, అట్టిసుందరాకారుని గవయజాలక పోతినిగదాయని హైమవతియు లోలోన జింతించి యప్పటి కొండొరులబాసిరి. అట్లు కామపీడితుండైన సోముండు తన కోరికనెరవేరమి, విరక్తుండై యీగ్రామసమీపమునగల కాళికాలయమునకరిగి, యట విలపించుచు గూర్చొనియుండెను. అదే సమయమున కాప్రాంతముగుండా జనునొకసన్యాసి మితిలేనిదుఃఖమునందు

చున్న చాకలివానినిగని జాలినంది, "ఓయీ! నీవెవ్వరవు? ఇట్లీ నిర్జనారణ్యంబున విలపించుచుండుటకు గారణంబేమి?" యనిసాదరమున బ్రశ్నింప నాతడు తనవృత్తాంతమునెల్ల మునికిజెప్పి, యనంతరము "స్వామీ! నేనా హైమవతిని గూడజాలకయున్నచో బ్రతుకజాలను. ఇక యీకాళికాదేవి సన్నిధానమున నాత్మహత్య గావించుకొని మరణించువాడ" నని చెప్ప, వాని దీనావస్థకాసన్యాసియెంతయు విచారించి, "వత్సా! ఇకవిచారింపకుము. నీవు మోహముగలిగి యున్న యా హైమవతిని నీకడకుబంపుభారము నాయది. నీవీ కాళికాలయమునందే యుండుము. నీకా మగువపొందు లభింపగలదు" అని వానినూరడించి, యాసన్యాసి యొక వృద్ధవనితవేషము ధరించి, పూలనమ్మెడువానివలె రాజాంతఃపురంబుజొచ్చి, తగిన యవకాశమును జూచి హైమవతితో చాకలివాని వృత్తాంతమును రహస్యముగజెప్పి, వానినిగూడ నొక యుపాయంబునుజెప్పి పోయెను.

ఆనాడాకసమంతయు మేఘములచే నావరింపబడియుండి, వృద్ధవనితా వేషధారియగు సన్యాసి యరిగినంతనే ప్రబలముగా వర్షింప నారంభించెను. అట్లు వర్షించుచున్న వర్షంబునుగని హైమవతి నిజభర్తండాయంజని, తనకా ముసలిది చెప్పినచొప్పున "నాథా! నేను పెక్కువత్సరములనుండి సంసారసుఖము ననుభవించుచున్నను నొక్క మొలకనైనను బడయలేకపోతిని. సంతతధారాపాతమై కురియు నీవర్షమును దిలకించితిరిగదా! ఇది కార్తీకమాసము. ఈపుణ్యకార్తియం దేమగువ నిజశరీరంబు నీవర్షజలంబున తడుపుకొనునో, నామె గర్భంబునందు నుసంతానముగలుగునని పెద్దలు చెప్పగా వింటిని. గాన నాకావర్షజలంబుల నొడలుతడుపుకొన ననుమతి నీయుడు. అనివేడ నాప్రభుండు "వనితల నమ్మువాడు వెర్రివాడు. నీవుబయటకరిగిన యేమొనర్తువో యెవ్వరు చెప్పగలరు. అట్లుచేయ వీలుపడదు." అని చెప్ప నాజాణ

తిరుగ నిజభర్తతో, "ప్రియా! ఇంతకాలమునుండి మీతో బరపురుషుని ముఖమెరుంగక గాపురముచేయుచున్న నన్నే నమ్మజాలకపోయితిరిగా! మీకంత యనుమానమైనచో మీరు నాచీరచెరగును బట్టుకొని, యీచూరుక్రిందనే తడువనిండు" అన నెట్టకేల కారాజందులకు సమ్మతించెను. అంత హైమవతి తనచీరచెరగును భర్తచేతికిచ్చి చూరుక్రింద నిలువబడి, యావర్షజలంబుల దడియుచుండెను. అంత కొంతసేపటికామగువ "నాథా! ఒకప్రక్క తడిసినది. రెండవప్రక్క గూడ తడుపుకొన నొక్కసారి చీరచెంగువదలి తిరుగ బట్టుకొనుడ" నిచెప్పి, రాజు చీరచెరగు వీడునంతలో నటవేచియున్న వృద్ధమాలిని చీరచెరగు నారాజుచేతికందించి, హైమవతీ ప్రక్కకు తప్పుకొనియెను. మేఘావృతమైన యాగాఢాంధకారములో నదే తనభార్య చీరకొంగను కొని రాజు వృద్ధవనితచెంగునే గట్టిగబట్టుకొని యుండెను. వృద్ధురాలి చీరచెంగును నిజభర్తకొసంగి, యాతనిని మోసగించిన హైమవతి వెంటనే యాతావునువీడి యాముసలిది చెప్పినప్రకారము కాళికాలయము జేరి యట బ్రహ్మానందముతో సోమునింగూడి మదనక్రీడల దనివితీర ననుభవించెను.

అట రాజుచేతిలో కొంగునుంచిన వృద్ధురాలు "నాథా! నాశరీరము రెండవప్రక్కకూడ తడియునప్పటికి నాకీ సన్యాసిరూపము వచ్చినది. ఇదియేమి ఆశ్చర్యము" అనుచు నాసన్యాసి వృద్ధవనిత వేషము దీసివైచి నిజరూపంబున నిలుచుండ, రాజు తనభార్య సన్యాసిగా మారిపోవుట కత్యధికాశ్చర్యముల మునింగి "ఓసీ! సన్యాసిగా మారిపోయిన నీవు నాకెందులకు. ఎటకైనబొమ్ము. నేను మఱియొక భార్యను స్వీకరింతు" నన, నాసన్యాసి, కృతకార్యుండై, తిన్నగా కాళికాలయమునకరిగి, యట నానందసాగరమున మునిగియున్న హైమవతీ సోములగని, "ఓకాముకులార! ఇకనిటనుండక యేదేశమైన

యరిగి సుఖింపుడన, వారా సన్న్యాసి యానతిననుసరించి, మరియొక దేశమరిగి అట సుఖించుచుండిరి. ఓమందారవల్లీ ! వ్యభిచరించిననునట్టి సాహస చాతుర్యంబులతోనె వ్యభిచరింపవలయును" అని చిలుక చెప్పగా మందారవల్లి "అబ్బా! ఎంత ప్రొద్దుపోయినది" అని నిజ పాన్పునుజేరి గాఢనిద్దురం జెందెను.

---

## 13 కామపాలునికథ.



పదునొకండవనాటి రాత్రంబున వైశ్యపుత్రియగు మందారవల్లి యత్యద్భుతముగ సింగారించుకొని, మలయకేతునితో మన్మథక్రీడల ననుభవింప నుత్సాహంబున రాజప్రాసాదంబున కరుగనున్న సమయంబున కీరమామె నడ్డుదగిలి, "అక్కా! నేనీనాడు చెప్పనున్న కామపాలునికథనుగూడ నాలకించి, కొందరుజాణలు వ్యభిచారము నొనర్చుటలో నెంతెంతటి చాతుర్యంబును జూపుదురో తెలిసికొని, నీవును నట్టి సామర్థ్యంబును బడయుము" అని యాచిలుక మందారవల్లికొక కథను జెప్పదొడంగెను.

"సిరిపురంబను పట్టణమును మున్నొకప్పుడు సువర్ణదీపుండను రాజు పరిపాలించుచుండెను. ఆభూనాయకునకు సుమతియను నొక సర్వాంగసుందరియగు భార్యకలదు. ఆరాజెన్ని సంవత్సరములకును సుమతియందు సంతానము బడయజాలకపోవుటచే విసిగి, విమతియను ద్వితీయభార్యను స్వీకరించెను. ఆమెను వివాహమాడిన యనంతరము

సువర్ణదీపుం డామెవలన నొకపుత్రసంతానమును గనియెను. విమతి కాపురమునకు వచ్చినప్పటినుండియు నిజభర్తయగు సువర్ణదీపుని యందు మక్కువలేనిదై, యన్యపురుషాశక్తిగలిగి తమయింట నను దినంబునను దేవతాపూజ సల్పుచుండు నొకబ్రాహ్మణయువకునివలచి యాతనితో రహస్యముగా మదనసౌఖ్యమునందుచు, నాతని వలననే పుత్రసంతానమును గనియెను. రాజీ రహస్యము నెరుంగజాలక విమతిగన్న కుమారుడు తనకు జన్మించినవాడేయని యానందించుచు, నాబాలకునకు జాతకాదికర్మల జేయించి, యల్లారుముద్దుగా బెంచు చుండెను.

ఆరాజనందనుం డయిదేండ్లప్రాయమువాడై యున్న కొండొక సమయంబున నతడు తనతల్లియగు విమతి బ్రాహ్మణకుమారునితో సరససల్లాపములాడుచు, ప్రేమచేష్టల జేయుచుండుటగని, నిజజనకుని కడకరిగి, "నాయనా! నాకు నీవొక్కడవేగాక మరియొకతండ్రి గలడుసుమా!" యనియెను. రాజా బాలకుని మాటలకు వింతజెంది భార్యయొక్క శీలమును శంకించినవాడై, యారాత్రి విమతితో గేళీ గృహంబునందుండు సమయమున నామెయం దెప్పటిమక్కువ లేని వాడై కుమారుడు తనతోననిన మాటలను భార్యతోజెప్పి "ఓసీ! నీకు మరియొకమగం డుండబట్టియే నాకుమారుడు తనకు మరియొక తండ్రికలడని చెప్పుచున్నాడు. దాన నీదుశ్శీలము తేటపడుచున్నది గదా" యనియెను అంత నాజాణ భర్తయొక్కనీడను గోడపై జూపి "నాథా! బాలకుని మాటలంతగా బట్టింపదగునా? అదే ఆగోడపై గల మీఛాయను జూడుడు. దానిని జూచియే యేమియునెరుంగని బాలుడదికూడ నొక ప్రాణియేయనుకొని మీతో దనకు మరియొక తండ్రి కలడనియెను. మీఛాయయే నాకు వేరుభర్తసుడీ!" అని యతిచాతుర్యమునబలికి తన రంకుతనమును గప్పిపుచ్చగలిగెను. అంత

నాభూపతియు భార్యయందెట్టి యనుమానమును లేనివాడై యెప్పటి యట్ల చరింపదొడంగెను.

ఓ మందారవల్లీ ! వింటివా విమతియొక్క సామర్థ్యము? నీవట్టి కల్లలెరుంగని ముగ్ధరాలవు. చాతుర్యములేకయే వ్యభిచరింపబోయిన వృథా వ్యధనొందుదువుగాన నీప్రయత్నము నిప్పటికైన మానుట మంచిది ” అని చిలుక చెప్పునప్పటికి దూరుపు తెల్లవారుటయు, పక్షులు కలకలారావంబుల మేతకై దమగూండ్లను వీడుటయు గనిన మందారవల్లి “ ఓహో ! అప్పుడే తెల్లవారుచున్నదే ” యని యాశ్చర్యంబున శయనమందిరమున కరిగి నిజతనువులు మృదుతల్పంబున వాల్చెను.

---

## 14 వసంతసేనకథ.

పదురెండవనాటిరాత్రి మందారవల్లి షడ్రసోపేతంబులతో భోజనము నారగించి, మృదుధవళాంబరధారిణియై, కమ్మనివాసనల విరజిమ్ము మల్లె, జేమంతాది నవవికసితపుష్పముల జడధరించి, యపరశృంగారవతియుంబోలె నలంకరించుకొని భూపతితో రతిసల్పి, తన చిరకాల వాంఛితమును దీర్చుకొననెంచి, రాజగృహంబునకు విలాసపూరితమగు మందగమనంబున నడచుచుండ శుకరత్నమా తరుణిని వారించి, “ ఓ యమ్మా ! నీవు రాజుతో రహస్యమునగూడ నరుగుచున్నావు. జారత్వమొనరించువా రతినేర్పరులై యుండవలయును. అమాయకురాల వగు నీవెక్కడ ! జారత్వమొనరించుటెడ ! నేనిపుడు జెప్పబోవు వసంత

సేనకథ నాలకించి, యామె చాతుర్యంబును గ్రహించి మరియు రాజ గృహంబున కేగుము" అని మందారవల్లికిక్రమంబున జెప్పెను.

"మున్ను అమరావతియను నగ్రహారంబున ననంతవర్మయను బ్రాహ్మణుండు సకలవేదశాస్త్రములను, అష్టాదశ పురాణంబులను బఠించి, తనచిరకాలతపఃఫలంబుగా వసంతసేనయను లోకోత్తరలావణ్య విలాసినిని బరిణయంబాడి, యామెతో సకలైశ్వర్య భోగంబుల నం దుచు, నిత్యమును హరినామమును జపించుచు కాలము గడుపుచుం డెను. నవయౌవనాంగియు, శృంగారవతియునగు నావసంతసేన చాంద సుడై నిత్యహరినామ స్మరణంజేయు నాబాపనితో సంసారసౌఖ్యము నందజాలక, యాపొరుగింటివాడైన సుశర్మయను నొక విప్రకుమారు నితో రహస్యముగ గామభోగంబుల నందుచుండ నామగువకొక్క శుభముహూర్తంబున నొక సుపుత్త్రుడు కలిగెను. అనంతవర్మ యా బాలకుని నతిగారాబంబున బెంచుకొనుచు, వానికి బంగార గజ్జెలను, గంకణములను జేయించిబెట్టి నేత్రానందము నందుచుండెను.

ఇట్లు నొకనాటి వేకువజామున వసంతసేన విటుండగు సుశర్మ కామపీడితుడై, యప్పుడెట్లయిన వసంతసేనను గలిసి రతిసల్పవలయు ననెడి దృఢవాంఛితము గలవాడై పాన్పునుదిగి తలుపుతెరచుకొని అనంతవర్మ యింటికరిగి యప్పటికప్పుడేలేచి హరినామస్మరణం జేసికొను చుండు నావిప్రునిబిలచి "అయ్యా! నాకు గొంత యగ్నిహోత్రము గావలసియున్నది. దయసేయుడు" అన, ననంతవర్మ భార్యనులేపి, సుశర్మకు అగ్నిహోత్రమునిచ్చి రమ్మనియెను. అంత నామగునయు వాకిటనిలుచున్న విటునిగని "అగ్నిహోత్రము గావలయునా, నా సౌఖ్యము కావలయునా?" అని ప్రశ్నింప నాతడు తాను నిజముగా నగ్నిగావలసి రాలేదనియు, నామెతో సురతభోగంబుల నందవచ్చితి ననియు జెప్ప, నామె వానిని లోనికిగొనిపోయి దేవతాపీఠముచెంత

హరినామస్మరణ జేసికొనుచుండు నిజభర్త చూడకుండగ నావిటుని దనపాన్పున బరుండజేసి, కుమారుని కాళ్ళగజ్జెలను వానికిగట్టి వానితో మనసార మదనక్రీడల దేలుచుండ, దేవీమందిరమున హరినామస్మరణ జేసికొనుచున్న నామెనిజభర్త యాగజ్జెలచప్పుడునువిని యందుండియే తనభార్యను బిలచి యాధ్వని యేమనియడుగ, నాజాణ "నాథా! మనబాలుడులేచి గంతులువేయుచుండుటచే వానికాళ్ళగజ్జెలును మువ్వలును ధ్వనించుచున్నవి" అని సమాధానమిచ్చుచునే, తనపనిని దాను చేసికొనుచుండెను. ఆమెమాటలకు హరినామస్మరణ జేసికొనుచున్న యనంతవర్మ మిక్కిలి సంతసించి "నాపాప యాడుచున్నాడా! నాయప్ప గెంతుచున్నాడా! నాకొండ క్రీడలు సల్పుచున్నాడా!" యని యాగజ్జెలధ్వని కనుగుణముగా దాను తాళమువేయుచు, హరినామస్మరణ జేసికొనుచుండెను. అట్లు మరికొంతతడవు గామముదీర వసంతసేనతో సంభోగించి, యనంతరమామె వలపుగాడరిగెను. ఓమందారవల్లీ! వింటివిగదా వసంతసేన సాహసచాతుర్యంబులు! అట్టివి నీకడ లేవుగాన యప్పుడే వ్యభిచరింపనరుగకుము" అని యాచిలుక చెప్పినకథను వినిన మందారవల్లి పొట్టయుబ్బునట్లునవ్వి, వసంతసేననేర్పునెంతయు మెచ్చుకొని నాటికి ప్రొద్దుపోవుటచే దనప్రయత్నమును మాని నిదురించెను.

---

## 15 చమత్కారవల్లికథ.



పదమూడవనాటిరాత్రంబున మందారవల్లి సర్వజనవిమోహితంబుగ నలంకరించుకొని, సముంచిత సౌరభకుసుమంబుల ధరించి, మలయ

కేతుమహారాజుయొక్క బాహువల్లరిజిక్కి, కేళీసౌఖ్యమునంద రాజాం
తఃపురంబున కరుగనున్న సమయంబున చిలుక యా నవయౌవనాంగిని
వారించి, చమత్కారవల్లికథ నీవిధంబున జెప్పదొడంగెను.

"ఓ చెలియా! మున్ను నరేంద్రపురంబను పట్టణంబును
నాగేంద్రుండనుభూపతి సర్వసమర్థుండై ప్రజాపాలనముజేయుచుండెను.
అతనికి మహాపతివ్రతయు, సాధువర్తనయు నగు వినయశీలయను
భార్యారత్నము గలదు. ఒకనాడారేడు భార్యతో సరసల్లాపముల
నాడుచు, "ప్రేయసీ! స్త్రీచిత్తము నెరుంగవలయునని నాకు బహు
కాలమునుండి కోరికగలదు. అది యెప్పటికిని నెరవేరకున్నది. ఆ రహ
స్యంబును విద్యావతివగు నీవెరుంగుదువేని యద్దానిని నాకుజెప్పి నా
కుతూహలంబును దీర్పుము" అన నాసాధ్వి నిజభర్తంగని "నాథా!
స్త్రీచిత్తమునెరుంగ బ్రహ్మాదులకైనను దరముగాదు. అయినను
రాజమార్గమునగల బావియొద్ద నొకగడియకాలము నిలచియుండుడు.
దాన మీకోరిక నెరవేరుట కవకాశమున్నది" అని చెప్ప నారాజు
మరునాటియుదయమున భార్య చెప్పినచొప్పునపోయి స్త్రీలెల్లరు నీరు
దోడుకొను బావియొద్దకుబోయి నిలుచుండెను.

అటనున్న వనితలెల్లరును నాగేంద్రభూపతినిజూచి, సిగ్గుపడి
వెనుకకుతగ్గి తమపనుల జేసికొనకుండిరి. అంత చమత్కారవల్లియను
యౌవనాంగి రాజుంగని తెగువజేసి "ఓరాజా! నీవిట్లీల స్త్రీజనంబుల
మధ్య నిలుచుండుటచే వారు బిడియపడుచున్నవారు గాన నీవిచటికరు
దెంచిన కార్యంబును సత్వరంబునుదెలిపి యుందుండి చనుము" అన
నా రాజా యౌవనాంగినిగని "ఓబాలా! కామినీ హృదయంబును
దెలిసికొనగోరి యిందు నిలుచున్నవాడను. నీవావిషయంబును నాకెరిం
గింతువేని, నిన్ను గొప్పగా బహూకరింతు" ననియెను. అంత నాజాణ
నవ్వుచు "ఓరాజా! అట్లయిన రెంటినెక్కి నూటినిజేబట్టి, ప్రొద్దు

గాని ప్రొద్దున కాడికత్తులనందున మానముగప్పెడి మద్దివృక్షంబుకడ కరు దెంతువేని స్త్రీహృదయము నెరుంగగలవు" అని చెప్ప, రాజా ప్రదే శంబును సంతసమునవీడి, నిజభార్యంగని చమత్కారవల్లి నుడివిన వాక్యముల నామెకుజెప్పి వాటిభావము నెరింగింపుమన, నాబుద్ధిమతి, "నాథా! రెంటినెక్కుట యనగా, పాదరక్షలధరించి, మూటిని బట్టు టన, వక్క లాకులు సున్నమును దీసికొని, ప్రొద్దుగాని ప్రొద్దు ననగా, నర్థరాత్రంబున, కాడికత్తిసందు ననగా వడ్రంగి, కుమ్మరివారియిండ్లకు మధ్య, మానముగప్పు మద్దివృక్షమనగా ప్రత్తిచెట్టుకడనున్న తనయిం టికి రమ్మని దీనిభావమైయున్నది" అనియెను.

అంత నాభూపతి యదేవిధంబున సన్నాహము గావించుకొని, చమత్కారవల్లి గృహంబునుగుర్తించి, యామెకు రహస్యముగ దన రాక నెరింగించెను. చాలకాలముక్రిందట వ్యాపారార్థము ద్వీపాంతర ముల కరిగిన నాతరుణిభర్త నాడే నిజగృహంబునకు జేరుకొనుటచే చమత్కారవల్లి గృహమును వీడ వీలులేనిదై మిగుల విచారించి, చేయునదిలేక తాను భుజించిన తామరాకును జుట్టబెట్టి రాజుపై బార నైచెను. అంతరాజు ఖిన్నుడై నిజగృహంబునకరిగి, భార్యతో నీవృ త్తాంతమునుజెప్పి దానిభావమడిగెను. అంత నాపతివ్రత "నాథా! తామరాకును మీపై వేయుటచే తామరకొలనుగలకడగల దేవాలయము నకు నేటిరాత్రి మిమ్ము రమ్మని నామె యభిప్రాయమై యుండును" అనిభార్యచెప్ప నాప్రభుం డావిధంబుననే నాటిరాత్రి తామరకొలను కడ దేవాలయమున వేచియుండెను. అంత నిద్రాపరవశుడై యున్న నిజభర్తనువీడి, చమత్కారవల్లి మనోజ్ఞముగా నలంకరించుకొని తామరకొలనుకడగల దేవాలయమున కరుదెంచి, అట దనరాకకై వేచి యున్న రాజుతో నారాత్రియంతయు నానందమొలుక గామక్రీడా సౌఖ్యమునంది, "ఓరాజా! స్త్రీహృదయమనిన నిట్టిదేసుమా! ఇవు

డింక నీసందేహనివృత్తియైనదిగాన నిజగృహంబున కేగుము" అని చెప్పి, యేమియు నెరుంగని యుత్తమసతియుబోలె నిజగృహంబునకరిగి భర్తతో పరుండెను.

రాజీవవృత్తాంతమును భార్యకుజెప్పి తనకోరికనెరవేర స్త్రీచిత్తమును దెలిసికొంటినన, నాపతివ్రత భర్తనుగని "నాథా! మీరు పరస్త్రీని గూడితిరనుఖేదము నాకెంతమాత్రమునులేదు. ఆ చమత్కారవల్లి మూలమున మీరు స్త్రీచిత్తము నెరింగితిరి. నాకంతియేజాలు" నని నవ్వుచు ననియెను ఓమందారవల్లీ! స్త్రీలలో చమత్కారవల్లి యంతటిజాణ లుందురు. నీవననెంత? గాన నీవింకను వ్యభిచరించుటలో గొంతనేర్పును, సామర్థ్యంబును సంపాదింపవలసియున్నది" అని యాచిలుక చెప్పునప్పటికి బ్రపంచము నంతటను నావరించియున్న గాఢతిమిరము నలువైపుల సడలుచుండుటచే ప్రభాతము కానున్నదని యెరింగి మందారవల్లి నాటికి తనప్రయత్నమునుపీడి నిదురించెను.

---

# 16 పద్మినీశశికుమారుల కథ.



పదునాలుగవనాటి సాయంసమయమున లోకబాంధవుండగు సూర్యభగవాను డస్తాద్రిం గ్రుంక, మందారవల్లి పంచభక్ష్యపరమాన్నముల భుజించి, వెలలేని భూషణంబుల ధరించి, వివిధామూల్య వస్త్రధారియై నానాజాతి సుగంధపుష్పంబుల సిగదాల్చి, అత్తరు బన్నీరుల శరీరంబున జిలికికొని, యపరంజితళుకుబొమ్మవలె సింగరించుకొని, మలయకేతుని బాహువల్లరిలోదేలి, మన్మథరాజ్య పట్టభద్రయై రతి

సౌఖ్యంబుల దేలియూఁడ, రాజాంతఃపురంబునకు హాయలుమీరార నడచు చుండ, బసిడిపంజరముననున్న కీరరత్నమా తరుణినిగని "ఓకోమలాంగీ! నీవు మలయకేతభూపతితో గామసుఖంబులనంద నరుగుచుంటివి. కాని యావ్యభిచారకార్యమును గప్పిపుచ్చుకొనగల సామర్థ్యంబు నీకడలేదే. అట్టితరి నీనిజభర్త యీనీజారత్వము నెరింగి నిన్ను బ్రశ్నించిన వానికేమని యుత్తరమిత్తువు? వ్యభిచరించుట కపూర్వసామర్థ్యముండవలయునుసుమా! కనుక నేనిప్పుడు జెప్పబోవు పద్మనీశశికుమారుల యత్యద్భుతకథ నాలకించి, యనంతరము నీయిచ్చవచ్చిన తెరంగున నాచరింపుము" అని యాచిలుక మందారవల్లికీ విధంబున పద్మినీశశికుమారులకథను జెప్పదొడంగెను.

"అక్కా! సావధానచిత్తవై యాలకింపుము. మున్నొకప్పుడు గాశ్మీరదేశంబును సువర్ణగిరియను పట్టణమును రాజధానిగా జేసికొని శుభకరుండనురాజు సుబుద్ధియను నమాత్యసహితుండై యవక్రపరాక్రమంబున, ధర్మచింతనాపరుండై ప్రజాపాలనంబు జేయుచుండెను. అదియేమి చిత్రమోగాని, యాయమాత్య రాజపుంగవు లిరువురునుగూడ సంతానవిహీనులై మిగుల జింతించుచుండిరి. ఎన్నియో వ్రతములజేసిరి. ఎన్నియో దానధర్మముల నాచరించిరి. ఎన్నెన్నియో యజ్ఞముల జేసిరి. అప్పటికిని వారిరువురలో నొకరికైనను సంతానము గలుగలేదు. అంత నొకనాడు రాజు సచివునింగని, "మంత్రిశేఖరా! సంతానవిహీనులమైయున్న మనకుత్తరగతులు చేకూరనేరవు. గాన నేనిపుడేబోయి సంతానముకొరకై దేశాంతరములకరిగి యేమహాత్ముని యనుగ్రహంబు నయినను సంపాదించి, మనయిరువురకునుగూడ సంతానసిద్ధి గలుగునట్లొనర్చుకొనివత్తును. అంతదనుకనీవు రాచకార్యముల జక్కబెట్టుచుండుము".

అనిచెప్పి, యానృపశ్రేష్ఠుండు రాజ్యభారమును సచివునకప్ప గించి, తాను నానాదేశయాత్రకై బయనంబాయెను అట్లాతఁడనేక ప్రదేశంబుల గనియెను. పుణ్యతీర్థముల ననేకంబుల సేవించెను. కాని యతనికార్యమెందును గొనసాగదయ్యె. అంత నతఁడు భగ్నమనోరథుండై నిజపురంబుజేర నరుదెంచుచుండ నతనికొక యరణ్యమార్గంబున నొక కాళికాలయము గనుపించెను. శుభకరుండా యాలయము బ్రవేశించి, "ఛీ! సంతానవిహీనుండనై నేను బ్రతుకుటకంటె, నీదేవీమూర్తికి నాశరీరమునర్పించి, కృతార్థుండనౌట మేలుకదా!" యని చింతించి, దేవికి సాష్టాంగనమస్కార మొనరించి, నిమీలిత నేత్రుండై "తల్లీ! త్రిలోకపావనీ! పాపనాశనీ! సంతానహీనుండనై బ్రతుకజాలక నిజశరీరంబును నీబలిపీఠంబున కెరగావించుచుంటిని. ప్రీతినిగైకొమ్మా!" అని ప్రార్థించి, యొరనుండి కత్తినిదూసి, కంఠమును నరుకుకొనబోవ, కాళికాదేవి యారాజునకు బ్రత్యక్షంబై "రాజకులచంద్రమా! సాహసమువలదు. నీభక్తిని, గార్యదీక్షకు నేనెంతయు సంతసించితిని. వలయువరముల వేఁడు మొసంగుదాన" నని చెప్ప, నాభూపతి దేవికి నమస్కరించి, "ఓ లోకమాతా! నేనును నామంత్రియు సంతానవిహీనులమై కుందుచుంటిమి. మాకు సంతాన ప్రాప్తిని గలుగజేసి, మావిచారము బాపుము. అంతియేజాలు" నన నాదేవి యొకదివ్య చూతఫలంబా నరేంద్రునకొసంగి "ఓరాజపుంగవా! ఈపండును గొనిపోయి సగము నీమంత్రిభార్యకొసంగి, సగము నీభార్యకిమ్ము. అంత వారిరువురవలన జగద్విఖ్యాత సంతానమును మీరు బడయుగలరు" అని నుడివి, యాదేవి యంతర్థానంబయ్యెను.

శుభకరుండును దత్యంత ప్రమోదమానసుండై, దేవీప్రసాదిత చూతఫలంబునుగొని, యనతికాలంబులోనె నిజరాజధానింజేరుకొని, యాపండును రెండుగా విభజించి, యొకభాగమును మంత్రిభార్య

యగు సుమతికొసంగి, మరియొకభాగంబును నిజభార్యయగు గుణవల్లి కొసంగ, వారద్దానిని భుజించి, యేకకాలంబుననె గర్భవతులైరి. అంత నవమాసపూర్తికాగానే, సుమతి గర్భంబు నొక మగశిశువును, గుణవల్లిగర్భంబున నొక యాడుశిశువును జన్మించిరి. అంత నారాజు మంత్రికుమారుననును, దనకుమార్తెకునుగూడ మహావైభవంబున జాతకాదికర్మల జేయించి, మంత్రినందనునకు శశికుమారుండనియు, దనకుమార్తెకు పద్మినియనియునామంబులిడి, వారిరువురను దనయంతఃపురంబుననే యుంచుకొని విద్యాబుద్ధుల జెప్పించుచు గారాబమున బెంచుచుండెను. వారు క్రమముగా నెల్లవిద్యల నభ్యసించుచు నొండొరులయం దత్యధికానురాగము గలిగి, యరక్షణమైన వియోగమును భరింపజాలనివారై, పదునారేండ్ల నవయౌవన రూపురేఖావిలాస సమానులై, చూచువారు మెచ్చునట్లుండిరి.

ఇట్లుండ, నొక్క మనోహర సాయంసమయమున పద్మినీశశికుమారు లిరువురును పుష్పవనంబున విలాసభాషణంబుల దేలుచున్న సమయంబున శశికుమారుండు పద్మినినిగని "మోహనాంగీ! నాకు దేశసంచారము చేయవలయుననెడి దృఢవాంఛితంబు గలదు. తలిదండ్రుల కీవిషయంబు నెరిగించిన వారు పోవననుమతింపరు. నీతోగూడ చెప్పకుండ నేగదలంచితిని గాని చిన్ననాటనుండి యేకహృదయులమై చరించిన కారణంబున జెప్పకుండ పోజాలనయితిని గాన నాప్రయాణమున కనుమతించి, నాపోక నేరికిని జెప్పకుండుము" అన, వానిమాటలకు బద్మినియిట్లనియె. "సుందరాకారా! నీహృదయమింతటి కఠినతరంని యెఱంగజాలనైతిని. చిన్ననాటినుండియు నిన్నే ప్రాణము కంటె నధికముగా బ్రేమించి, నిన్నుదక్క నన్యుల వివాహమాడనని హృదయమున శపథముగావించుకొనిన నన్నీరీతిని విడచిపోవుటతగునా? నీకును నాయందు నిజమగు ప్రేమగలదని నమ్మితిని. నానమ్మికయెదార్థ

మయిన, నన్నును నీ వెనువెంటనే గొనిపొమ్ము వత్తును. లేదేని నీవరుగకమున్నె నీపాదములచెంతనె తనువును వీడుదు" నన, నామంత్రికుమారుండు తన్ను మనసారవలచిన పద్మినినిగూడ దనతో దీసికొనియేగుట కంగీకరించెను. అంతనాపద్మినీశశికుమారు లిరువురును నొకయర్ధరాత్రంబున నేరికిని దెలియకుండ బొక్కసమునుండి వలసినంతధనమును మణిహారముల దీసికొని, దివ్యాశ్వారోహులై ప్రపంచయాత్రార్ధ మరిగిరి" అని శుకము చెప్పునప్పటికి, మందారవల్లి నిద్దురభారమును వహింపజాలక "ఓ శుకమా! తరువాయికథను రేపు చెప్పెదవులెమ్ము నిద్రచే గన్నులు మూతలు పడుచున్నవి. నేటికి చాలింపుము" అని నిజతల్పంబునుజేరి నిదురించెను.

ఆశుకశ్రేష్ఠంబును మందారవల్లి మలయకేతునితో సంభోగించు కార్యమును మరచి నిద్రించెగదాయని సంతసించుచు దానును నాపంజరమునందు గన్నులమూసెను.

---

# 7 వేశ్యమాతకథ.



ఆమరునాటిరాత్రి మందారవల్లి తిరుగ సర్వాలంకార విభూషితయై రాజగృహంబునకు గేళీసౌఖ్యమునంద నరగుచున్న సమయంబున శుకమామెనుబిలచి, "నెచ్చెలీ! గతరాత్రంబు కథను సాంతముగా నాలకింపకుండగనే వ్యభిచరింప నరుగుచుంటివి ఇది తగునా?" అన మందారవల్లి "ఓకీరమా! తరువాయికథనుగూడ వినినయనంతరమే రాజాంతఃపురంబున కరుగుదునులెమ్ము. అట్లు దేశాంతరముల కరిగిన పద్మినీశశికుమారు లిరువురును నేమయిరి? వారి నెడబాసిన

రాజామాత్యు లేమొనర్చిరి ?” అని యడుగ, నాచిలుక తన మృదు భాషణంబుల మందారవల్లి కిట్లు చెప్పదొడంగెను.

“అక్కా! సావధానచిత్తవై యాలకింపుము. అట్లా కామినీ కాముకు లిరువురును నశ్వారోహులై నానాదేశసందర్శనార్థమై పయనంబై, యారాత్రంతయు గంటకానేకంబులగు దుర్గమమార్గంబుల నెన్నింటినోదాటి, యుదయమగునప్పటికొక భీకరారణ్యముం జొచ్చిరి. ఆసమీపమునంగల యొక పద్మాకరంబున బద్మినీశశికుమారు లిరువురును గృతస్నానులై యటగల యొకసుందరదేవాలయ ప్రాంగణమున విశ్రమించి, దాము తెచ్చుకొనిన విలువఫలహారముల భుజించి సవిలాసముగ ముచ్చటించుచున్న సమయంబున బద్మిని “ప్రియా! ఈసుందరవనమును నిందుగల యీదేవాలయమును ప్రకృతికన్నియకుబెట్టని యలంకారములై, యెంతమనోహరముగ నున్నవి. ఇట్టి యానందోదయవేళ మనమిరువురము నికముందెన్నడును నొండొరుల బాయకుండునట్లా యాలయదేవి ముఖంబున గాంధర్వవివాహము జేసికొనుటలెస్స” అని తన మెడయందు నక్షత్రమాలవలె దేదీప్యమానమై వెలుగందు యొక మణిహారమునుదీసి, యద్దానిని శశికుమారుని గంఠమునవైచి, కిలకిలనవ్వెను. ఆమె వలపుచేష్టలగని శశికుమారుండెంతయు ముదమంది యాద్వివమణిహారమును గని యచ్చెరువందుచు, నాదేవాలయపు గోడలపై జిత్రింపబడిన రంభ, యూర్వసి, మేనకాది దేవాంగన పటముల గని, వాని యందన్నిటికంటెను ప్రతిభా భాసురమై యొప్పుచున్న మేనకచిత్రమునుగని దాని సౌందర్యాతిశయంబుల కచ్చెరువందుచు, దనచేతనున్న పద్మినియమూల్య రత్నహారము నామేనకబొమ్మ కంఠమునవైచి యపుడద్దాని మనోహరాకృతిందాల్చి పరమానంద మందుచుండెను. అనంతరము వారటనే మరికొంతతడవు విశ్రమించి, ప్రస్తా

ననాజనితాహ్లాదమున నా హారమునేమరచి, యశ్వారోహులై యా తావునువీడి పోయిరి.

వారట్లు మరికొంతతడవు ప్రయాణముసల్పి అమృతవాహిని యను నొకపట్టణము బ్రవేశించిరి. యాపట్టణ బాహ్యప్రదేశంబున నొకవృద్ధురాలు తలను మోదుకొనుచు నశ్రుజలంబులు సంతతధారా పాతములై ప్రవహింప నేడ్చుచుండెను. పద్మినీశశికుమారు లిరువు రును నావిలపించు వృద్ధురాలిండాసి, “ఓ యవ్వా! నీవెవ్వరవు? ఇట్లు విలపించుటకు గతంబేమి?” యని సాదరమున నడుగ, నాముదుసలి విచారమునుబాసి, పరమానందభరితురాలై, పద్మినిని గౌగలించుకొని శశికుమారునితో నిట్టులనియెను. “వత్సా! నేనీ యమృతవాహినీ పట్టణవాసినగు నొకవేశ్యను, నళినియనుదానను. యప్సరసవంటి పను నారేండ్ల పసిడిబొమ్మను గతరాత్రంబున బొట్టనుబెట్టుకొని పుత్రికా శోకంబున నిట్లు విలపించుచుంటిని. ఆ మాయకలరాజాధ్యము వచ్చి నాకుమార్తెను గొనిపోకున్న నాకీవిచార ముండియుండెడిదికాదు. నావద్ద మురుగుచున్న ధనము నుపయోగింప నెవ్వరునులేరు. నీతోనున్న యీమోహినిని గనిన నాకు పుత్రికావాత్సల్యము జనించుచున్నది. మీరిరువురును నాగృహంబుననుండి నాకు బ్రమోదమును గూర్పుడు. నాధనమునెల్ల ననుభవింపుడు. లేకున్న నేను మీపాదములచెంతనే మరణించుదాన” నని నుడువ, పద్మినీశశికుమారు లిరువురును నావేశ్య మాతనుగని జాలినంది, యామెవిచారమునుబాప నామెతో నరిగిరి. అంత నావేశ్యమాతయు వారలనిరువురగ నిజభవనంబునకు గొనిపోయి సకలవిధోపచారంబులజేసి, మృష్టాన్నభోజనమిడి, తనవద్దగల యమూ ల్యాభరణములను, మణిహారములను దెచ్చి వారిముందిడి “ఇవియ న్నియుమీవి. వీటిననుభవించుచు సుఖంబుగ నాయింటనుండు” డను చుండ, శశికుమారునకు బద్మినియొసంగిన మణిహారముసంగతి జ్ఞప్తికి

వచ్చెను. అంతనతడు ప్రియురాలినిగని, "ప్రేయసీ! నీవు నాకొసంగిన నుజ్వలహారంబు నాదేవాలయమున దేదీప్యమానమగు మేనకాచిత్రముయొక్క కంఠమునందే మరచివచ్చితిమి. నేనిపుడె యతిరయంబున నటకేగి క్షణములో నా హారమును గొనితెత్తును. నీవిందే యుండుము" అని యామె వలదని యెంతవారించినను, వేశ్యమాత యా హారము దమకేపాటిది నీవు దానికై యరుగకుమని యెంత బ్రతిమానినను వినక, శశికుమారుఁడా హారమునుబోలినదీ పృధ్విపై నుండ జాలదని నుడివి, దానిని గొనిరా నశ్వారూఢుడై యరిగెను. అనతికాలములోనె యతడా దేవళప్రాంతముజేరి, యట మేనకకంఠమునందున్న మణిహారమును గుఱ్ఱముపైనుండియే గరవాలమున నందుకొని దానిని మెడయందు వైచుకొని వచ్చుచుండగా నామణిహారమునకు జుట్టుకొనియున్న యొక క్రూరసర్పము శశికుమారుని గాటువైవ నతడు విషముతలకెక్కి మృతుడై యాయశ్వముపై నొరిగెను. అంతనాయశ్వమాశశికుమారుని మృతకళేబరమును మూపునధరించి, వచ్చినమార్గముననే నడచి పోదొడంగెను" అని చిలుక చెప్పునప్పటికి మందారవల్లి "ఓ శుకరత్నమా! నిద్దురకు దాళజాలను. మిగిలిన కథను రేపు చెప్పుము" అని నుడివి నిజశయ్యంజేరి సుఖనిద్దురం జెందెను.

---

## 18 మంజువాణికథ.



పదునారవనాటిరాత్రి రాజుతో రతిక్రీడానుభవానందము నందవలయుననెడియాశతో మందారవల్లి వివిధరీతులముస్తాబై యరుగుచుండ, గతరాత్రంబు చిలుకచెప్పిన శశికుమారునికథ జ్ఞప్తికిరాగా, నామగువ శుకమణింగని, "ఓకీరశ్రేష్ఠమా! నిన్నటిరేయి కథ నసం

పూర్తిగా విడచితివి. సర్పదష్టుండైన శశికుమారునిగతి యేమయినదియు నతనిని మనసారవలచిన పద్మిని యాతని వియోగము నెట్లు భరించి నదియు నతిరయంబున జెప్పుము. నేనద్దానినిగూడ విని త్వరితగతిని రాజగృహంబునకరుగుదాన" నని నుడువ, నాచిలుక మందారవల్లికి క్రమంబున జెప్పుచున్నది.

"ప్రియసఖీ! వినుము. సర్పదష్టుండై మృతినొందిన శశికుమారు నావిధంబుగా మూపుననిడుకొని యాయశ్వరాజంబు అమ్మృత వాహినిని జేరెను. కాని పద్మినియున్న వేశ్యమాతయిల్లును గుర్తింప నేరక మరియొకమార్గమునుబట్టి వేరొకవీధియందు దిరుగుచుండెను. ఆవీధియందుగల యొకదివ్యహర్మ్యమునందు వసించు రంభ, యూర్వ సులసహితము మించిన లావణ్యవతియు, నపూర్వతేజోవిలాసినియునగు మంజువాణియను నొకవారకాంత ఆయశ్వముగని, దానిపైబడియున్న శశికుమారుని రూపురేఖావిలాసములకు భ్రమసి, యాయశ్వమునుబట్టి శశికుమారునిదించి, నిజాంతపురంబునకు గొనిపోయి వానిని హంస తూలికాతల్పంబున బవ్వళింపజేసి, వివిధోపచారంబుల జేసెను. కాని యెంతకును నాసుందరుడు మేల్కొనడయ్యె. అంత నామధురవాణి దుఃఖము నాపుకొనజాలక "అయ్యో! ఇట్టి మోహనాకారునకు జీవములు లేకుండుటయా! ముల్లోకముల నెనలేని సౌందర్యోపేతుడగు నీమన్మథాకారుని గూడజాలసి నాజన్మవ్యర్థంబు. తగినపురుషమూర్తి లభించువరకు గన్యాత్వముననే నుండుననిచరించుచున్న నాకు నేడు తగిన జగన్మోహనాకారుడు లభించియు వ్యర్థంబయ్యెనే" యని చింతించి, తల్లినిబిలచి, "అమ్మా! ఈసర్వజనవిమోహిత రూపమును గనుము. ఇతడిట్టి తేజోమయుడయ్యు జీవముల బాసియున్నట్లు దోచుచున్నది. ఇతనిని సజీవునొనర్చి, నేను వివాహమాడజాలకుందునేని- నేనును నీతని పసిడివన్నె శరీరముతో దగ్ధనై కృతార్థురాలనయ్యెద" నని నుడువ,

నామెతల్లి యాయమృతవాహినీ మహాపట్టణమునంతను వెదకి 'మృత జీవనుండ' ను నొక మహామంత్రవేత్తను రావించి, మృతప్రాయుడై యున్న శశికుమారుని జూపెను. అంత మంజువాణి యామాంత్రికుని గని, "అయ్యా! ఇతడిట్లుండుటకు గారణమేమి? మృతుడైనాడా? అయిన నీవీతనిని సజీవునిం జేసితివేని నాయొంటిపైనుండు యమూల్యా భరణముల నన్నింటిని నీకు గానుకగా నొసంగుదాన" ననిపలుక నా మంత్రవేత్త శశికుమారు నెల్లరీతుల బరీక్షించి, యాతని కంఠహారము నకు జుట్టుకొని గాఢనిద్దురంజెందుచున్న సర్పపుబిల్లంజూచి "అయ్యో! ఇతడు సర్పదష్టుడై మృతినందినాడు అదిగో! యాకృూరఫణి యాతని కంఠహారమునకు జుట్టుకొని నిదురించుచున్నది. మీరు దూరముగా నరుగుడు" అనిచెప్పి యాభుజంగమును నేర్పునబట్టిలాగి దానిచేతనే శశికుమారుని దిరుగగరిపించి, యతనిశరీరమునందున్న విషజ్వాలనులాగి వైచి యనంతరము తనమంత్రప్రభావంబున నెన్నియోరీతుల శ్రమ పడి కృతకృత్యుండాయెను. అంత శశికుమారుండు నిద్దురమేల్కాంచిన వానిపగిది లేచికూర్చొని తనచెంతనున్న పరివారజనంబును, అద్భుత తేజోవిరాజిత లావణ్యవతియగు మంజువాణినిగని విభ్రాంతుండయ్యెను. అంత మంజువాణి మంత్రగాని కనుకొన్నప్రకార మనేకబహుమానం బులనొసంగి వానిని దృప్తుంజేసి పంపివైచి యనంతరము శశికుమారున కభ్యంగస్నానమును బన్నీటజేయించి, యమూల్యములగు బట్టువస్త్ర ములగట్టి మృష్టాన్నభోజములనిడి, మృదుతల్పంబున నాశీనుంజేసి, "ఓ మనోహరా! నిన్ననేకగష్టంబులకోర్చి బ్రతికించుకొంటిని. ఇక నీవే నాప్రియుండవు. నిన్నుదక్క నేనన్యుల గన్నెత్తియైన జూడ జాలను. నీవు నన్నుపాలించి కరుణజూడవలయు" ననివేడ, శశికుమా రుండును నామె జగద్విఖ్యాత సౌందర్యమునకు విమోహితుండయ్యెం గాన నాటినుండియు నామెభవనమునందేయుండి మహాభోగంబుల దేలు చుండెను.

మంజువాణియు, వానిగుట్టును లోనగట్టివైచి, యరక్షణా మైనను శశికుమారునివీడక, రాత్రిందివముల భేదమెరుంగక సతతము వానితో సుగంధపరిమళ ప్రపూర్ణంబగు కేళీగృహంబున హంసతూలికా తల్పంబునజేరి మన్మథసామ్రాజ్యమును యథేచ్ఛగానేలుచు, శశికుమారు నానందసాగర డోలికావీచికల దేల్చుచుండెను” అని శుకరాజంబు చెప్పునప్పటికి మందారవల్లి నిద్రాభరంబునగన్నులుమూతలు పడుచుండ “ఓచిలుకా! నీపసిడిపలుకులనిక చాలింపుము. ఇక నిద్ర నాపుకొనజాలను” అనిచెప్పి మృదుపాన్పుజేరి శయనించెను. ఆ శుకరాజంబును తనపంజరమునందే మేనువాల్చెను

---

# 19 మందారపుష్పకథ.



ఆమరుసటిరాత్రంబున మందారవల్లి సకలాలంకార పరిశోభిత యై మలయకేతునితో మదనక్రీడల నందవలయునని యువ్విళ్ళూరుచు నరుగుచుండు సమయంబున చిలుక యామెనువారించి “కోమలాంగీ! ప్రాణముకంటెను నెక్కుడుగావలచి, నిజగృహంబును, జననీజనకులను, సమస్తరాజభోగంబులనువిడచి, యట్లు వేశ్యమాతయింట శశికుమారుని బాసి, దుఃఖించుచున్న పద్మినిగతి యేమయినదియు దెలిసికొనకుండగనే నీవు రాజుతో గామసుఖంబులనంద నరుగుటతగునా? నీకింతకాఠిన్యమా! యన, మందారవల్లి, “ఓకీరోత్తమా! అవు నడుగమరచితిని. కాశ్మీరదేశాధీశుని తనయయగు పద్మినిగతి యేమయినది? అట మంజువాణి యను వారకాంతయింట శశికుమారుడింకను నట్లె భోగలాలసుడై యుండెనా? తరువాత నేమిజరిగినదియు జెప్పుము. ఆ తరువాయి వృత్తాంతంబునుగూడ విన్నయనంతరమే రాజును గూడనరుగుదు”.

అన నాశుకరాజంబు మందారవల్లి కీవిధంబుగా పద్మినీశశికుమారుల తరువాయికథ జెప్పెను.

"అక్కా! వినుమమ్మా! ఆట వారముదినములనుండి వార కామినియగు మంజువాణి, మంత్రితనయుడగు శశికుమారుని మంచము మీాదికాలును గ్రిందబెట్టనీయకుండ, సకలవిధోపచారంబుల జేయుచు వానినిగూడి వివిధరీతుల సంభోగసౌఖ్యములనందు స్వర్గమున దేలుచుం డెను. మంజువాణితల్లియగు విమతి కుమారితచేష్టలయందిష్టములేనిదై "అయ్యో! దినమునకు వేయివరహాలనిచ్చు వైశ్యపుత్రులనెల్లర దిర స్కరించి, నిర్ధనుండగు నీశశికుమారునిగూడి నాకుమార్తె కాలమునం తను వ్యర్థముచేయుటయేగాక, యున్నధనమునంతను విలాసములకై వెచ్చించుచున్నది. ఈశనిగాని నెట్లయిన హతమొనర్చినగాని మాదరి ద్ర్యము పోదు. విషమిడుదమన్న, వాడుభుజించు పదార్థములనెల్ల ముందుదాను చవిచూచినగాని నాకుమార్తెశశికుమారునకిడదు. కత్తితో ఖండింతునన, నత డతిసాహసుడు ఇకనేమిచేయునది? ఏదోయుపాయ మున వానిని వెడలనడిపినగాని మాకు ధనలక్ష్మి చేకూరదు" అని నిశ్చయించి, విమతి కాళికాలయమునకరిగి, దేవి యిచ్ఛావిహారమున కరిగిన సమయమున దానాలయము బ్రవేశించి తలుపుల బిగించుకొని యెను.

మరికొంత తడవునకు విహారమునకరిగిన కాళి యరుదెంచి, తలుపుబిగించుకొని తనయాలయమునం దెవ్వరోయుండుటనుగని తలుపు తట్టి పిలచెను. అంత లోనున్న విమతి "ఓయమ్మా! కాళికాదేవీ! నాకుమార్తెను శశికుమారుండను పురుషపిశాచము పట్టుకొని వారము దినములనుండి యామెను రతిక్రీడలచే పీల్చి పిప్పిచేసివైచుచున్నాడు. వానినెట్లయిన హతమొనర్చుయుపాయమును జెప్పినగాని, నీకు తలుపు తీయుదానను గాను" అనిచెప్ప నా కాళికాదేవి లోనున్నవిమతి కిట్టులని

యెను. "ఓ వేశ్యమాతా! శశికుమారుండన నెవ్వఁడనుకొనుచుంటివి? అతఁడు నావరప్రసాదంబున గాశ్మీరదేశామాత్యునకు జన్మించిన జగద్విఖ్యాతపురుషుండు. అతనివద్దగల యమూల్య మణిహారమునకు నీ ధనమేగాక యీయమృతవాహినీపురాధీశ్వరుని బొక్కసములోని ధనమంతయుగూడ సరిరాదు. అతనినిగడతేర్చుట కేరికిని సాధ్యముకాదు" అని నుడివిన కాళికాదేవిమాటలకు విమలికినిసి, "అట్లయిన నేనీతలుపును తీయుటలేదు" అనియెను. అంత గాళి నిజాలయంబున జొరనుపాయంబునుగానక, విమలికొక్క పంచరంగుల మందారపుష్పము నొసంగి "ఓసీ! ఈపూవును శశికుమారుని సిగయందు దురిమితివేని, యతఁడు చిలుకరూపధారియై నీగృహంబునువీడిపోగలఁడు. ఇక తలుపు తీసి నన్ను లోనబ్రవేశింపనిమ్ము" అనిచెప్ప నాజారవనిత పరమానందభరితయై మందారపూవును నిజగృహంబునకు గొనిపోయి శశికుమారున కతిగారాబంబున జలకమార్చుమిషంతో యతని కంఠహారమును దీసికొని శిగను విప్పుచున్నట్లునటించి, యామందారపూవు నాతని సిగలో దూర్చెను. ఆక్షణమునందే శశికుమారుండొక పంచరంగుల చిలుకగామారి యంతరిక్షమార్గమున నెగిరిపోయెను.

ఆదృశ్యమును గాంచిన మంజువాణి గోలుగోలున నేడ్చుచు "అయ్యో! నామనోహరుఁ డెగిరిపోవుచున్నాఁడు! ఇకనాకు గతియేది? జన్మజన్మంబులకయిన నేనట్టి నవమన్మథాకారుని బడయజాలను" అని రోదనసేయ, నామెతల్లి యేమియు నెరుంగనిదానివగిది కుమార్తెనోదార్పజొచ్చెను. ఆపంచరంగులచిలుక యట్లుపోయిపోయి ఆయమృతవాహినీ పట్టణరాజకుమార్తెయు, నద్వితీయ లావణ్యశోభావిరాజితయు నవయౌవన సుకుమారతేజోవిలాసినియు నగు సులోచనాకన్య యంతఃపురంబుపై వ్రాలెను" అని శుకంబు వైశ్యసతియగు మందారవల్లితో జెప్పునప్పటికారాత్రి చాలప్రొద్దుపోయెను. దాన మందారవల్లి నిజ

మృదుతల్పంబునందును, కీరరాజంబు నిజపంజరమునందును బవ్వళించి నిదురించిరి.

# 20 సులోచనకథ.



ఆమరునాటి సాయంసమయంబునగూడ మందారవల్లి గతరాత్రంబునకువలెనే బెండలకడనే మృష్టాన్నభోజనముల నారగించి యథోచితంబుగా నలంకరించుకొని మలయకేతభూపతితో సురతక్రీడల నందవలయునని యరుగుచుండ, బంగారుపంజరమునందున్న చిలుక యామెను బిలచి "ఓ వైశ్యసతీతిలకమా! నిన్నటిరాత్రి తరువాయికథను విన కుండగనే పోదువా?" యని ప్రశ్నింప, నామగువ చిలుకతో "ఓ కీరరత్నమా! అధికకామాతురనగు నేనావిషయమునే మరచితిని. అట్లు, పంచరంగుల చిలుకరూపంబుతోనున్న శశికుమారుండు, అమృతవాహినీపురాధీశ్వరుని కుమార్తెయగు సులోచనకన్య మేడపై వ్రాలెనని కదా చెప్పితివి. ఆ సులోచనయన నెట్టిది? ఆమె గుణవిశేషములెవ్వి? ఆమె మేడపై వ్రాలిన యాపంచరంగులచిలుక యేమియొనర్చె? ఆసర్వ వృత్తాంతమును నాకు వినిపింపుము. అద్దాని నాలకించిన యనంతరమే రాజాంతఃపురంబున కరుగుదాన" అని మందారవల్లియన, శుకరాజం బామెకీవిధంబున జెప్పుచున్నది.

"సోదరీ! సావధానచిత్తవై యాలకింపుము. రాజకన్నియ యగు సులోచన తనమేడపై వ్రాలిన పంచరంగులచిలుకనుగని, దాని యద్భుతసౌందర్యమున కాశ్చర్యమంది, దానియందధికానురాగంబు గలదై, బిరబిర జనకుండగు ప్రతాపభూపతికడకరిగి, వానినచటికిగొని వచ్చి యా యపురూపమైన చిలుక నాతనికిజూపి "జనకా! నాకెట్టు

లయిన నాచిలుకను బట్టించియిమ్ము. దానితో నాడుకొన నాకెంతయో ముచ్చటకలదు ” అని యాచిలుకనుగని పలుతెరంగుల మురిసెను. అంత నారేడును తనముద్దులపట్టి కోరిక నెరవేర్చుటకు బద్ధకంకణుండై, సమర్థులగు వేటకాండ్రనురావించి యాచిలుకను బట్టుకొన యాజ్ఞాపించెను. ఆవేటకాండ్రు పలువిధంబుల బ్రయత్నించియు దానిని బట్ట జాలక విఫలమనోరథులైరి. ఆసుందరతరమగు చిలుక దనకు లభింప లేదుకదాయని సులోచనయు, దనకుమార్తెయొక్క కోరికను నెరవేర్ప జాలకపోతినిగదాయని ప్రతాపుండును బలువిధంబుల విచారించుచుండ నాయయిదునన్నెల చిలుక తటాలునవచ్చి రాజకుమార్తె కరముపై వ్రాలెను. అంత నాసులోచనయు దానిని నేర్పున బట్టుకొని బంగారు గొలుసులదెప్పించి దానిని బంధింపనుండ నాచిలుక మనుష్యభాషణంబున సులోచన కిట్లులనియెను. “ ఓ మదవతీ! నేనే ఆయాచితంబుగ నీకరముపై వ్రాల నన్నిట్లు బంధింపదగునా ? నేను పారిపోవ దలంపుగల దానినై తినేని, నీకరముపై నేల వ్రాలుదును ? ఈమాత్రము వివేకము వలదా ? ” యన నాసులోచన తన యవివేకమునకువగచి, యాచిలుకను బంధింపక, పలువిధంబుల ముద్దాడి, కౌగలించుకొని ముచ్చట దీర్చుకొనుచు, నొక బంగారుపంజరమును దెప్పించి దానికి పాలును బండ్లను సమృద్ధిగాబెట్టుచు నాపంజరమునందుంచి పెంచుచుండెను.

ఒకనాటి రాత్రిసమయంబున మోహనాంగియగు సులోచన తన యంతఃపురంబున హంసతూలికాతల్పంబుపై యాపంచరంగుల చిలుకతో నాడుకొనుచు మోహపరవశయై దానిని చుంబించుచు, కౌగలించి, చనుగుబ్బలకుబెట్టి యదుముకొనుచు, వివిధరీతుల క్రీడాసాగరమున దేలుచుండ నాచిలుక తలజాలులోని మందారపుష్పము వీడి క్రిందపడెను. తోడనే యాచిలుక యొకమన్మథాకారుడగు సుందర యౌవనపురుషుండై సులోచనముందర నిలచెను. వివిధాభరణ

తేజోవిరాజితుండగు నామోహనాకారునిగని సులోచన యాశ్చర్యానందములు మనమున నినుమడింప, యొకింతభిడియమునంది, యనంతరము చంచలేక్షణయై యాయపరమన్మథుని దనబాహువల్లరి నిరికించుకొని "ఓహో! ఏమినాభాగ్యము! నాపాలిట పుష్పశరుండవై యవతరించిన నీవు యక్షుండవో, సిద్ధుండవో, గంధర్వుండవో చెప్పి నన్నుజేపట్టి నాకామబాధను దీర్పుము" అన శశికుమారుండామెతో "కోమలగాత్రీ! నేను యక్షుండనుగాను, సిద్ధుండనుగాను, మరెవ్వండనుగాను, కాశ్మీరదేశామాత్యుని పుత్రుండను. శశికుమారుండనువాడను" అని తన యావద్వృత్తాంతమును నామెకుజెప్పి, యామెతో నారేయెల్లను సంభోగక్రీడాసౌఖ్యమును వివిధరీతులదేలి, సులోచనకు దన్మయానందమును జేకూర్చెను. ఆవిధంబుగనే సులోచన పవలెల్లయు మందారపువ్వు నాతని శిరమునందుంచి చిలుకగాజేసి, రాత్రులందాపూవును దీసివైవ నాతడు శశికుమారునిగామార యాతనితో పలువిధరతిక్రీడల దేలుచు గొన్నిదినంబులు గడపెను.

అనంతరము గొన్నాళ్ళకు సులోచనకు గర్భచిహ్నములు గానుపింప, నావిషయమును రాజునకు దెలుపకున్న తమకు మోసముజెందుననియెంచి యామెచెలు లొకదినంబున సులోచనతల్లియగు వీరమతింజేరి, "దేవీ! నీకుమార్తెకేలనో గర్భచిహ్నములు గనబడుచున్నవి. పోతుటీగకైనను జొరనశక్యంబైన నాయంతఃపురంబున నామెకు బురుషసంపర్క మెట్లుకలిగెనో దెలియ బ్రహ్మదేవునికైన దరముగాదు. ఈసమాచారమును దాచిన మాటవచ్చుననియెంచి, యాకన్యవృత్తాంతమును ముందుగా మీకు జెప్పితిమి" అనిచెప్పి వారుచనిరి. అనంతర మీసమాచారము నిజభర్తకెరింగించి, వేగిరపడక రహస్యమును గుర్తించవలసినదిగా జెప్పెను. అంత నారాజును సమర్థులగు చారులనియోగించి కుమార్తెయొక్క జాడలను, నాకన్యను మోసగిం

చినపురుషుని గుర్తించి బంధింపవలసినదిగా నాజ్ఞాపించెను అంత గొందరుచారులు స్త్రీవేషములధరించి, సులోచనయొక్కజాడల గుర్తించుచు బహుజాగరూకులై జారునిబట్ట జూచుచుండిరి. అంత నొకనాటిరాత్రి సులోచన శశికుమారునితో మృదుతల్పంబున గవాక్షద్వారమును మూయమరచి రతిక్రీడల దేలుచున్నసమయంబున స్త్రీవేషధారియగు నొకచారుడా దృశ్యమునుంగని, బయట గొళ్ళెముంచి, దొంగ దొరికెననిజెప్ప రాజుకడకరిగెను. ఈసమాచారము సులోచన నిజచారులగు చెలియలమూలంబున నెరింగి, "మనోహరా! నేటితో నాకును నీకును ఋణము తీరిపోయినదా! అక్కటా! ఇక నీపొందును గూడుభాగ్యము నాకులేదుకాబోలును. ఉదయముననే తలారులువచ్చి నిన్ను గొనిపోవుటయేగాక, నన్నువధించి తీరుదురు" అని దుఃఖించుచుండ, శశికుమారుండామెతో, "తన్వీ! ఎప్పటికేది ప్రాప్తమో యెవరు చెప్పగలరు. విచారింపకుము. నామూలమున నీవుగూడ మరణించుట పాడిగాదు. గాన ఉదయముననే నామందారపుష్పమును నాసికయందుంచి చిలుకగామార్చివైచుము. తలారు లరుదెంచునప్పటికి నేనాకసమున నెగిరిపోదును. అంత నిరువురముగూడ నపాయమును దాటవచ్చు" నన, సులోచన విధిలేక యట్లొనర్ప సమ్మతించెను. నాటి యుదయమున తలారులరుదెంచి, సులోచన యంతఃపురంబు జొరబడ నాపంచరంగులచిలుక యంతరిక్షమార్గంబున నెగిరిపోయెను. అంత పరకాయప్రవేశవిద్యనెరింగిన యొకభటుడు డేగరూపంబునుధరించి, చిలుకను వేటాడించెను" అని చిలుక చెప్పునప్పటికి కాకులు కూయజొచ్చెను. ఇక తెల్లవారనున్నదనియెంచి, మందారవల్లియు, చిలుకయుగూడ నిద్రించిరి.

---

# 21 సన్న్యాసికథ.



రత్నదీపునిభార్యయగు మందారవల్లి యామరుసటిరాత్రంబున నధికకామపీడితయై మలయకేతునితో సంభోగసౌఖ్యముల నందవలయు నని వివిధమణిమయాలంకార విభాసినియై యరుగనున్న సమయంబున చిలుకయామెనువారించి "ఓకలినాత్మురాలా! ప్రియవల్లభునిగానక యట్లు వేశ్యమాతయింట పరితపించుచున్న పద్మినిగతి యేమయినదియు దెలిసికొనకుండగనే రాజుతో సరసంబులాడ నరుగుటకు నీమనసెట్లొ ప్పెను" అన, నంతమందారవల్లి నాలుకకరచుకొని "అయ్యో! నేనస లామెసంగతినే మరచితినిసుమా! అవును శశికుమారునిబాసి వృద్ధవేశ్య యింటనున్న పద్మిని యేమయినదియో చెప్పి, నాసందేహమునుదీర్పుము ఆ కథనుగూడ విన్నయనంతరమే భూపతితో సంభోగసుఖంబులనంద నరుగుదునులెమ్ము" అని నుడువ, నాశుకమామె కిట్లు చెప్పుచున్నది.

"వైశ్యసతీ! సావధానవై యాలకింపుము—అచట వృద్ధవార కాంత యింటనున్నపద్మిని, హారమునుదెచ్చుటకై యాలయమునకరి గిన తనప్రియుండెప్పటికిని రాకుండుటనుగని, యమితఖేదంబునంది తన్ను పుత్రికావాత్సల్యంబున జూచుకొనుచున్న వేశ్యాంగనను దిల కించి "ఓయమ్మా! మణిహారమునకై యరిగిన నాప్రియుం డెన్నా ళ్ళకును రాడయ్యె. అత డేయపాయమునొందెనో యిడుముల గుడుచు చుండును. నామనోవల్లభునిబాసి నేను బ్రతుకజాలను. ఆత్మహత్య గావించుకొని మరణింతును. అగ్నిని రగుల్పుము" అన నావృద్ధాంగన వెరగంది "రాజపుత్రీ! శశికుమారున కెట్టిహానియురాదు. కొద్ది రోజు లోపికపట్టియుండుము. అతడు తిరుగరాగలడు" అనిచెప్పి యెన్నియోవిధముల ధైర్యముగొలిపి యామెప్రయత్నమును మాన్ప

జూచెను. కాని పద్మిని తనపట్టునువీడక శశికుమారునిబాసి యరక్షణ మయినను బ్రతుకజాలననుచుండెను. అంతనావేశ్యవధూటి "అమ్మా! నామాటవినకుంటివి. ఏమిసేతు? మనపట్టణంబున నొకగొప్పసన్యాసి కలడు. అతడాగతనాగతంబుల లెస్సగ జెప్పగలడు. శశికుమారుడిక నిన్ను జేరజాలడని యతడు చెప్పెనేని, నీవు నీయిష్టప్రకార మగ్నిబడ వచ్చును. ఒకవేళనతడు నీప్రియుడు తిరుగరాగలడని చెప్పినచో నీ ప్రయత్నమును వీడుదువా?" యని ప్రశ్నింప, బద్మిని యట్లే చేయుదునని వాగ్దానమొనర్చెను.

అంత వారిరువురును నొక ప్రాతఃకాలసమయంబున నాపట్టణ బాహ్యప్రదేశంబునగల సన్యాసికడకు టెంకాయలను, నరటిపండ్లను, దక్షిణతాంబూలములనుగొని యరిగి, సన్యాసినిదర్శించిరి. అంతబద్మిని యాసన్యాసికిమ్రొక్కి, కాన్కలొసంగి "ఓ మహానుభావా! నేను మనంబున నొకతలంపును గలిగియుంటిని. అది యేరీతినిజరుగునో తెల విచ్చి మాయులమటను దీర్పుడు" అనివేడ, నా సన్యాసి, "ఓ యమ్మా! నీవు ప్రియునిబాసి వియోగజలధినిబడి దుఃఖించుచుంటివి. నీమనోహరుని నీవు త్వరలో జేరగలుగుదువు. అంతదనుక నెట్టిసాహస కార్యముల జేయక నోపికతో వేచియుండు" అని యానతీయ, నాపద్మావతీవేశ్యలు పరమానందభరితులై యాసన్యాసికి వివిధరీతుల మ్రొక్కులిడి నిజగృహంబున కరిగిరి.

పద్మిని ఆత్మహత్యాకార్యమును వీడి నిత్యమును శశికుమారుని నామమునే స్మరించుచు, యాతనిరూపమునే మనంబున జిత్రించుకొని పూజించుచు నిమిషమొక యుగముగా గడుపుచుండెను.

అటవేశ్యకుమార్తెయగు మంజువాణియు గొంతకాలము శశి కుమారునితో సర్వభోగంబులనంది, యనంతరము విమతికుట్రచేసతడు

చిలుకయై మింటికెగిరిపోవ, నాకన్య "ఓమనోహరా! మోసముచేసి పోతివా? ఇదినీకు దగునా?" యని పరిపరివిధంబుల దుఃఖించి, యనంతరమాతని యెడబాటును సహింపలేక యాతనిని వెదకుచు పిచ్చి దానివలె వీథుల దిరుగాడుచుండెను.

అక్కడ రాజాంతఃపురంబున చిలుకరూపంబుతోనున్న శశి కుమారునితో గొంతకాలము సర్వకామభోగంబుల ననుభవించి గర్భిణి దాల్చిన సులోచన, రాజదండనకు వెరచి, యెప్పటి చిలుకరూపమును ధరించి మింటికెగిరిపోయిన దనప్రియుని వియోగమును భరించలేక, యన్నహారముల ముట్టక, సర్వాభరణముల దీసివైచి, సతతము విధి విరామములులేక, కంటికిని మింటికిని నొకేధారగా నేడ్చుచుండెను" అని చిలుక జెప్పునప్పటికి మందారవల్లి నిద్రనాపుకొనజాలక "ఓకీర రాజమా! నిద్దురవచ్చుచున్నది. రేపటిదినమున దిరుగ జెప్పెదవు లెమ్ము" అన నాచిలుకయు నికకథను జెప్పుటమాని యాపంజరములో నిదురింప, మందారవల్లియు నిజపాన్పున బవ్వళించెను.

# 22 వైశ్యాంగనకథ



"ఓశుకరాజమా! శశికుమారునకై విలపించుచున్న పద్మిని, మంజువాణి, సులోచనలగతి యేమయినది? అట్లు గగనమార్గంబున డేగరూపధారియగు రాజభటునిచే దరుమబడిన చిలుకరూపధారియగు శశికుమారుండేమయ్యెను?" అని యామరుచటిరాత్రంబున మలయకేతునితో సురతభోగంబుల నందబోవ నరుగుచు బ్రశ్నించిన మందారవల్లి ప్రశ్నంబుల కాకీరమిట్లు చెప్పుచున్నది.

"కోమలగాత్రీ! యాలకింపుము—ముందు చిలుకయు నా వెనుక డేగయు నంతరిక్షమార్గమున చాలసేపుతిరిగి చిలుకను బట్టుకొన వలయునని గ్రద్దయు, గ్రద్దను దప్పించుకొని పారిపోవలయునని చిలుకయు బట్టుదలగలవారై యింటనెగురుచుండిరి.

ఆ యమృతవాహినీ నగరమునందే గేశవశెట్టియను నొకకోమటి కలడు. అతనికి నవలావణ్యవతియు, నిరుపమాన తేజోరాశియునగు వాసవియనునొక కుమార్తెకలదు. ఆజగద్విఖ్యాత రూపంపుబొమ్మకు విధివశంబున నొక గుష్టురోగియు, వికారస్వరూపుండును నగు శోమిశెట్టియను వైశ్యుడు భర్తగా దాపురించెను. ఆ వికారుండు దినమునకు వందసారులు బహిర్దేశంబున కరుగునలవాటు కలదు. వాసవియు దవ కాతనియందు మక్కువలేకున్నను బాడుసంఘమునకు వెరచి, తలిదండ్రులకుభీతిల్లి యట్టె వానితోనెట్లో యసహ్యించుకొనుచు గాలము గడుపుచుండెను.

ఆనాడు వాసవిభర్తయగు శోమిశెట్టి బహిర్దేశమునకుగూర్చొని యుండ, వాసవి యాతనికొరకై యొకచెంబుతో జలమును బట్టుకొని, నిజగృహద్వారముచెంత నిలబడియుండెను. అదేసమయంబున చిలుకయు డేగయు నొకవెదురుపొదలో పోరుచుండ, చిలుకజూలులోని మందారపువ్వు అచటిడొంకలో చిక్కుకొన, నాచిలుక శశికుమారుండై పరుగుపరుగున నరుదెంచి, యావాకిటనిలుచున్న వాసవికడకరిగి, "ఓ తన్వీ! నేనీయింటిలో దాగొందును. నన్నొకదుర్మార్గుడు వెంటాడించుచున్నాడు. అతడిక్కడకువచ్చి నిన్నడిగిన 'నాకు తెలియద'ని చెప్పి నన్నుగాపాడుము" అనిచెప్పి యతిరయంబున నాయింటిలోనికిబోయి దాగొనియెను. అనంతర మాడేగరూపుండైన భటుడు మానవరూపమునుదాల్చి, కోమటిచిన్నదానికడకువచ్చి, "ఓయమ్మా! ఈవైపున కొక మోసగాడు పరుగెత్తుకొనివచ్చె, అతడెందేగెనో చెప్పుము" అని

యమగ వైశ్యపుత్రియగు వాసవి, యట వెంటనుప్పరి బహిర్దే శంబునకు గూర్చొనియున్న నిజభర్తనుజూపి, "ఓయయ్యా! అదుగో అతడే యిపుడెందుండియో పరుగెత్తుకొనివచ్చి, నిన్ను గనినంతనే నేమియు నెరుంగనివానివలె, బహిర్దేశంబునకు గూర్చున్నట్లు నటించు చున్నాడు" అనిచెప్ప, ఆక్షణమునందే రాజభటుడు రోగిష్టియు, గురూపుండును నగు శోమిసెట్టిని బంధించి, రాజుకడకు గొనిపోయెను.

వాసవియు పీడవదలిపోయినదని సంతసించుచు లోనికరిగి, నవ మన్మథాకారుడగు శశికుమారునిగని, యతడు తనభాగ్యదేవతయని యెంచి, "ఓస్వామీ! నీప్రాణములకు నాప్రాణముల నడ్డువైచి యైనను, నీకెట్టియాపదయు రాకుండ జేసెదను. నీవే నాభర్తవు. నా దరిద్రదేవతను రాజభటుడు గొనిపోయినాడు. నేను చెప్పునట్లెల్ల నాచరించుచుండుము. మనకెట్టిమోసమునురాదు" అనిచెప్పి, వానిని తలిదండ్రులకడకు గొనిపోయిచూపి, "ఓజననీజనకులారా! నేనను దినంబును గాళికాదేవికి జేయుపూజలు నేటికిఫలించినవి. ఆతల్లి నిత్య రోగిష్టియగు నాభర్త నీవిధంబుగా మహాసౌందర్యవంతునిగా నొనర్చి నాకోరికనీడేర్చినది. కాని, యితనికి దృష్టిదోషము దగులకుండుటకై కొన్నాళ్లు రహస్యముగా దాచుమని యాదేవియాజ్ఞ. గనుక మీరును నాభర్తయిట్టి సౌందర్యోపేతుడై నట్లెరికిని జెప్పకుండుడు." అన నావైశ్యదంపతులు పుత్రిక మాటలనమ్మి, యామె పాతివ్రత్యమహి మను, యల్లునిజగద్విఖ్యాత సౌందర్యమునుగని పరమానంద భరితులై యామెచెప్పిన తెరంగున నాచరించుటకు సంతోషమున నంగీకరించి యల్లునివృత్తాంతము నతిగూఢముగానుంచిరి.

మహాజాణయగు నావాసవి యట్లు శశికుమారునితో నానా విధ రతిక్రీడలం దేలుచు నానందసముద్రమున నీదులాడి, తనకట్టి

మోహనాకారునిఁబొందు దొరకినందుల కమితాహ్లాదము నందుచుం డెను. శశికుమారుండును నాలావణ్యవతితో గామసుఖంబుల నందుచు దానంతవఱకు గగనమార్గంబున దిరిగిన శ్రమంబు నావైశ్యాంగన యం తఃపురంబున దీర్చుకొనుచుండెను" అని చిలుక చెప్పునప్పటికి జాల ప్రొద్దుపోయెను. అంత మందారవల్లి చిలుకతో "ఓ చిలుకలరాజా! ఇక నిద్దురనాపుకొనజాలను. రాజుతో గామసుఖంబులందుమాట దేము డెరుగు. ఇక పరుండము" అన నాపక్షియు వల్లెయని తనబంగారు పంజరమున మేనువాల్చె, మందారవల్లియు మృదుపాన్పున బరుండి గాఢనిద్దురం జెందెను.

# 23 నలుగురు భార్యల నరపతికథ



ఆ మరుసటిరాత్రంబునగూడ మందారవల్లి మలయకేతునితో మన్మథక్రీడలనందు కోరిక బాయనిదై, యథోచితంబుగ నలంకరించు కొని, పుడమినవతరించిన యప్సరసాంగనో యనునట్లు రాజగృహంబున కరుగనున్న సమయంబున బంగరుపంజరముననున్న కీరమామెనుబిలచి, "అక్కా! నిన్నటితరువాయికథ నీదినంబున బూర్తిగావించెదను. వినవా? కథ సాంతముగాకుండ మధ్యలోవిడువరాదు. గాన దీనిని గూడవిని మరియుపొమ్ము" అన మందారవల్లి యందులకు సమ్మతిం చిన యనంతర మాశుకమణి యిట్లు చెప్పదొడంగెను.

"అట్లు రోగగ్రస్తుడయిన శోమిశెట్టిని రాజభటుడు బంధించి తన్నుచు రాజుకడకు గొనిపోయి, యతడే సులోచనతోగూడిన వంచకు డనిచెప్ప, నాకోమటి ప్రభునిగని యిట్లు చెప్పెను. "దేవా! నే

నేపాపంబును నెరుగిసి రోగగ్రస్తుడను. కేశవశెట్టి యల్లుడను. నేను వ్యాధి పీడితుడనై పెంటమీఁక బహిర్దేశమునకు గూర్చొనియుండగా నాభార్య నీళ్లచెంబును బట్టుకొని వాకిట నిలబడియుండెను. ఇంతలో నామెకడ కేవడో నవమన్మథాకారుండగు యువకుడొకడు సర్వాభరణభూషితుండై వచ్చి, దానితో నేమోజెప్పెను. అంతనామె రాజభటునకు నన్నుజూపి తానా నూతనపురుషునితో లోనకరిగి తలుపుబిగించెను. ఆభటుడు నాకాలుసేతులు బంధించి మార్గముపొడుగునను దన్నుచు నిటకు దోడ్తెచ్చెను" అని మొరపెట్టుకొన, రాజా యద్భుతమునుగని పలువిధంబుల నాలోచించి, శోమిశెట్టి కెట్టిహానియుజేయక, వానినొక చోదాచి, యామరునాడు కేశవశెట్టినిరావించి, "ఓ వర్తకశిఖామణీ! నీయల్లు నిటకొకసారి పిలిపింపుము. కొన్నిమణులను నాణ్యముచేయ నలసియున్నది" అన నావర్తకుండు మనమున భీతికలిగియు, "అయ్యా! నాయల్లుడు రోగగ్రస్తుడై యున్నాడు. బయటికి రాజాలడు" అనిచెప్ప, రాజుగ్రుడ్డై, "ఓయీ! ఈక్షణంబున నీయల్లు నిటకు రావింపకుందువేని నీకు మరణదండనను విధించువాడ" నని కఠినముగజెప్ప, నావర్తకుండిక చేయునదిలేక నిజగృహంబునకరిగి కుమార్తెకును, యల్లుడనుకొనుచున్న శశికుమారునకును నీరాజాజ్ఞ నెరింగింప, వాసవి మహాదుఃఖమున "అయ్యో! ఇంతలోనె ప్రమాదము రావలయునా? నాథా! ఇంతటి యనతికాలములోనె మనకు ఋణము తీరి పోయినదా! అక్కటా! దైవమెంతనిర్దయుడు!" అని విలపించుచుండ శశికుమారు డామె నూరడించి, "తన్వీ! విచారింపకుము. నాకెట్టిభయమునులేదు. నేనిపుడు రాజుకడ కరుగకుంటినేని, నీతండ్రికి మరణదండన విధింపబడును. నాకొరకై యతడట్టి వృథాశిక్షనందనేల? నేను రాజుకడకరిగిన సర్వము జక్కబడగలదు" అనిచెప్పి, యతడు కేశవశెట్టితో రాజసభ కరిగెను.

ఈలోపునరాజు పట్టణమునంతను నలంకరింపజేసి, రాజప్రసాదంబును బ్రత్యేకంబుగా ముస్తాబుజేయించి, శశికుమారుండు కేశవశెట్టితో నరుదెంచ, వానికెదురేగి తోడ్తెచ్చి, తన సింహాసనమున గూర్చుండబెట్టి, నిజకుమార్తెయగు సులోచన నటకురావించి, యతనిని జూప, నామె యానందోన్మాదంబున శశికుమారుని గౌగలించుకొని, "తండ్రీ! ఈమన్మథాకారుడే నీయల్లుడు. చిలుకరూపంబునుధరించి, నాయంతఃపురంబున గొన్నాళ్లుండి, నాకు గర్భిణియొనర్చినదియు నీతడే సుమా!" యన, నారాజు శశికుమారునితో "ఓమహానుభావా! నీవు సామాన్యపురుషుండవుగావు. యేసిద్ధుండవోయై యుందువు. నీ వృత్తాంతమునెల్ల మాకుజెప్పి, కృతార్థులంజేయుమా!" అని చెప్పుచుండ, గేశవశెట్టి తనయల్లుడు, రాజున కెట్లల్లుడైనదియు, నతడట్లు సింహాసనమున గూర్చుండి రాజుచే నేలసత్కరింపబడుచున్నదియు దెలియక తెల్లబోయి చూచుచుండెను.

అంత శశికుమారుండు, తాను కాశ్మీరదేశామాత్యుని కుమారుండననియు, ఆదేశమునకు రాజైన శుభకరుని కుమార్తెయగు పద్మినితో నానాదేశసంచారార్థమైయరిగి, చిలుకరూపము నెట్లుపొందినదియు సులోచనతో నెట్లు నేస్తముగలిసినదియు, తిరుగ నాచిలుకరూప మెట్లు బాసినదియు మొదలుగాగల సర్వవృత్తాంతమును రాజునకెరింగించి తన ప్రథమభార్యయగుపద్మిని యాపట్టణమునగల వేశ్యవనితయింట నుండెననియు నుడివి, వారలనెల్లర నాశ్చర్యాద్భుతముల దేల్చెను. అనంతర మారాజు సులోచనను శశికుమారునకిచ్చి మహావైభవంబున వివాహముజేసి, వేశ్యమాతయింటనున్న పద్మినినిగూడ నేనుగనెక్కించి గొనివచ్చి, యామెను శశికుమారునకు జేర్చెను. చిరకాలవియోగానంతరము గలిసికొనిన ప్రియునిగని, యానందబాష్పములరాల్చి పద్మిని ఆరాజుకుమార్తెయగుసులోచన తనకు జెల్లెలగుటకెంతయు సంతసించెను.

అనంతర మొకనాడు అంబారియేనుగుపై శశికుమారుండు ప్రథమభార్యయగు పద్మినితోడను, ద్వితీయభార్యయగు సులోచనతోడను, మహావైభవంబున నూరేగుచుండ, వేశ్యకన్యయగు మంజువాణి పిచ్చిదానివలె వీధులదిరుగుచుండ, శశికుమారుండామెనుగని, యామెనుగూడ నాయేనుగుపై నెక్కించుకొనియెను. అంత మంజువాణి తిరుగ దనప్రియుని బడయగలిగినందులకును, సులోచన, పద్మినుల సవతులగుటకును మిగులసంతసించి, క్రమముగా జరిగిన యావద్వృత్తాంతమును దెలిసికొనియెను. శశికుమారుండట్లు మువ్వురభార్యలతోడను నూరేగి, రాజభవనము జేరునప్పటికి రోగిష్టివాడగు శోమిశెట్టి మరణించెనని దెలిసెను. అతనికి దహనచర్య లాచరింపబడిన యనంతరము, తన్ను మనసార ప్రేమించి, నిజభర్తం గోల్పోయిన వాసవిని గూడ బరిగ్రహించుట యుచితమని రాజుచెప్ప, శశికుమారుండు వైశ్యపుత్రికయగు వాసవిని చతుర్థభార్యగా స్వీకరించి, యానలువురభార్యలతోడను రాజాజ్ఞనంది, నిజరాజధానికరుగ బయనంబయ్యెను. అట కాశ్మీరదేశంబున కుమార్తెనుగానక రాజును, కుమారునిగానక మంత్రియు జింతించుచుండ, శశికుమారుండు పద్మినితోడను, మరి మువ్వురభార్యలతోడను వారినిజేరి, తామిల్లువిడచినది మొదలు నాటివరకు జరిగిన సర్వవృత్తాంతమును వారికిజెప్పి, యానందసాగరమున నోలలాడించెను. అనంతరము ఆరాజామాత్యులు పద్మినీశశికుమారులకు యథావిధిగా వివాహమొనర్చి, వానిని రాజ్యాధికారిగాజేసిరి. శశికుమారుండు పద్మిని, మంజువాణి, సులోచన, వాసవి కన్యకల నలుగురకు భర్తయై, దేవేంద్రవైభవంబున రాజ్యపాలనంబుజేసె. అక్కా! ఇక కథముగిసినది. పరుండము" అని చిలుకచెప్ప, మందారవల్లి నిదురించెను.

---

# 24 మనోరమకథ.



ఇరువదొకటవనాటిరాత్రి మందారవల్లి పన్నీట నభ్యంగన మొనర్చి, యమూల్యరత్నాభరణముల ధరించి, మలయకేతునితో సంభోగసౌఖ్యములనంద రాజగృహంబునకరుగనున్న సమయమున, చిలుక యామెనుబిలువ, ' అయ్యో ! చిలుకా ! ప్రతిదినంబును నిల్లే నాశృంగారమంతయు వ్యర్థముజేసి, నాకామమునంతను పాన్పుపాలుసేయుచుంటివిగదా ! ఇక నాకోరికతీరుటయెట్లు ? నేనారాజునుగూడుటయెట్లు ?" అని మందారవల్లి సవిచారంబున నన, నాచిలుక దిరుగ " అక్కా ఈయొక్క కథనుమాత్రము వినిపొమ్ము. ఇది యన్నిటికంటెను విచిత్రమయినదిసుమా ! " అన, " పోనీ ! అట్లనేజెప్పుము. దీనినికూడవిని మరియు రాజగృహంబునకు బోదును " అని మందారవల్లి యనెను. అంత నాశుకశ్రేష్ఠంబు మందారవల్లి కీవిధంబున జెప్పదొడంగెను.

" మున్ను వినుతగిరియను పట్టణంబును వినయశీలుండనురాజు పరిపాలించుచుండెను. అతడు పెద్దకాలము అనపత్యుండై యనంతరము బట్టమహిషియగు ఇందిరాదేవివలన నొకచక్కని పుత్రికారత్నమును గనియెను. ఆచిన్నది క్రమముగాబెరిగి పుష్పవతియై, త్రిలోకసుందరి యని జగద్విఖ్యాతిని నందెను. వినయశీలుండు నిజకుమార్తెయగు మనోరమ షోడశకళాప్రపూర్ణ నూత్నయౌవనాంగియై యుండుసమయమున నామెకెల్లవిధంబుల దగినవరుని బడయగోరి నానాదేశంబుల వెదకించెను. కాని యా లలనామణికి యెనయగు రాజకుమారుండెందును గానరాకుండెను. అంత నారాజు పురోహితుని రావించి, " అయ్యా ! నాకుమార్తెకు దగినపురుషుండు యీమహాప్రపంచమున లేడట. ఇక సేయునదేమున్నది ? " యని చింతాకులమనస్కుండై యుండ, నాపురోహితుండు " రాజోత్తమా ! ఇది కడుచిత్రముగనే

యున్నది. ఇంత రాజలోకముండ, మనోరమకు దగినవరుడే దొరక లేదా! నేనును బ్రయత్నించి చూచెద. మీకుమార్తెయొక్క ఛాయాపటము నొకదానిని నాకీయుడు." అన నారాజెంతయు సంతసించి, యొక రత్నపుటుంగరముపై మనోరమయొక్క చిత్రమును జెక్కించి దానిని బురోహితునకిచ్చి "బ్రాహ్మణోత్తమా! వరుడు మీకునచ్చిన నాకు నచ్చినట్లె. ఈమెకు దగినపురుషుం డేదేశమువాడైనను సరె మీకు గనుపడినయెడల వెంటనే శుభముహూర్తము నిర్ణయించుకొని రండు. ఆసుందరాంగికి వరనిర్ణయము జేసితిరేని, నాశక్తివంచనలేకుండ మిమ్ము బహూకరింపగలను" అనిచెప్పి, యాపురోహితునకు వలసిన ధనమిచ్చి, వరాన్వేషణమునకై బంపెను.

అంత నాపురోహితుండును, నానాపట్టణములనుదిరిగి, యనేక రాజకుమారుల దిలకించెను. కాని మనోరమకు దగిన సమానవయోరూపుండగు రాజకుమారుం డెవ్వడును గానరామి, యతడెంతయు ఖిన్నుడై చేయునదిలేక విఫలమనోరథుండై, నిజపురాభిముఖముగా జనుచు మార్గమున నొక వనమునందు విశ్రాంతిదీసికొన విడసెను. అటనే నేదేశమునుండియో యరుదెంచుచున్న గొందరుపురోహితులు విడిసియుండి, ప్రస్తావనావసరంబున నొండొరుల వృత్తాంతమునడిగి తెలిసికొనగా వారు చంద్రగిరినగరాధీశుండైన చంద్రసేన మహారాజు పురోహితులమనియు, నతనికుమారుడగు కీర్తిచంద్రునకు దగిన రాజకుమార్తెను వెదకుటకై బయలుదేరి, యెందును నాసుందరాంగునకు దగినచిన్నది దొరకక, నిరాశులై నిజపురాభిముఖులై జనుచు, నటవిడిసితిమనియు నుడివిరి. అంత వినయశీలుని బురోహితుండు, వారును దనస్థితిలోనే యున్నవారని యెరింగి, తన వృత్తాంతమునుగూడ వారికి జెప్పి, తనవద్దనున్న మనోరమ చిత్రమున్న యుంగరమునుదీసి వారికి జూప, వారును కీర్తిచంద్రుని చిత్రరువున్న యుంగరమునుదీసి వానికి

జూపిరి. అంత నిరువైపుల పురోహితులును రెండుంగరములను నొక్క చోజేర్చి చూడ, నవి యొండొంటి కెంతమాత్రమును దీసిపోక, బ్రహ్మ వారిరువురనుస్వర్గమునందే భార్యాభర్తలగా యొనర్చియేజన్మింపజేసెనా యను నట్లాశ్చర్యము గొల్పుచుండెను. అంత నాపురోహితులు పరమానందభరితులై, మనోరమను కీర్తిచంద్రునికిచ్చి వివాహముజేయ నొక్కశుభముహూర్తమును నిర్ణయించుకొని, యానాటికి మగపెండ్లివారు చంద్రగిరి కరుగవలసినదిగాను నేర్పాటుగావించుకొని, చెరియొకమార్గమును ననుసరించిపోయిరి. ” అని చిలుక చెప్పునప్పటికీ, మందారవల్లిని నిద్రాదేవి పీడింప నామె “ ఓముద్దులొలుకు మురిపెంపు చిలుకా ! ఇక నిద్రనాపుకొనజాలనే. నేటికి కథనుజెప్పుట చాలింపుము తరువాయికథను రేపుచెప్పవచ్చును ” అన నాచిలుకయు నట్లనేచేయుదమనిచెప్పి, యాపంజరమునందే మేనువాల్చి కన్నుమూసెను. అనంతరము మందారవల్లియు నిజశయనగృహంబునకరిగి హంసతూలికాతల్పంబున బరుండి సుఖనిద్దురంజెందెను.

## 25 కీర్తిచంద్రుని కథ



ఇరువది రెండవనాటిరాత్రి మందారవల్లి ప్రశస్తవస్త్రాభరణములధరించి, నొసటకస్తూరితిలకంబుదిద్ది, సుగంధపూరిత తాంబూలము సేవించుచు, కొన్ని పరిమళ నవవికసితపూలమాలల చేబట్టి రాజుతో రతికేళినిదేలవలయునని యరుగుచుండ, చిలుక యామోహనాంగిని బిలచి “ ఓతన్వీ ! శుభముహూర్తము నిశ్చయింపజేసి, యామనోరమ కీర్తిచంద్రుల వివాహవృత్తాంతమునుగూడ వినకుండగనే యరుగుట పాడియా ? ” యన, నావైశ్యసతి “అట్లయిన నావివాహసమాచార

మునుకూడ వేగిరము జెప్పుము. దానినికూడ యాలకించినమీదటనే రాజగృహంబున కరుగుదాన " అన, నాశుకరత్నము మందారవల్లి కీక్రమంబున జెప్పదొడంగెను—

" అట వినయశీలుండు తనకుమార్తెకు దగినవరుని నిర్ణయించి, ముహూర్తము నిశ్చయించిన బురోహితుని బహువిధంబుల సత్కరించెను. యాముహూర్తకాలంబున చంద్రగిరిరాజు యేనుగులతోడను, గుఱ్ఱములతోడను, రథపదాతులతోడను, నెల్లరరాజబంధుగులతోడను, బురోహితాది పరివారంబులతోడను వినుతగిరికి మనోరమ వివాహమునకు మహావైభవంబున తర్లివెళ్లెను. అట వినయశీలుండును బెండ్లివారిని సగౌరవంబున నెదుర్కొని వారివారికి దగినవిడుదుల నేర్పాటు గావించి, దేవేంద్రవైభవంబునకు మించిన శోభాయమానంబుగా గీర్తిచంద్రమనోరమల వివాహకార్యమును నెరవేర్చి, యెల్లరకును నుచిత రీతిని సత్కరించిపంపెను. వివాహానంతర మల్లుని గుమార్తెను నొక నెలదినంబులు తనయింటనే నుంచుకొని పిమ్మట మనోరమకు లెక్కకు మిక్కుటంబైన సారెచీరెలనొసంగి, నిజపరివారంబుల దోడిచ్చి కీర్తిచంద్రునితో నిజతనూజను నత్తవారింటికి సాగనంపెను. అత్తమామలచే వీడ్కొలుపబడిన గీర్తిచంద్రుండు నిజభార్యాసహితుండై స్వపురి యగు చంద్రగిరికి బయనంబయ్యెను. అట్లుచనుచున్న కీర్తిచంద్రరాజ కుమారుండు మార్గమున నొకశృంగారవనమునుగాంచి, యటగొంత తడవు నిజపరివారజనంబులతో విశ్రమింపదలంచి, గుడారములు వేయించి యందువిడసెను.

స్వర్గవనంబనదగు నాయుద్యానవనమున సుఖభోజనుండై యొక మల్లెపొదచెంత మృదుపాన్పు నేర్పాటుగావించుకొని, యందు నిజభార్య యగు మనోరమతో గొంతతడవు సరససల్లాపములాడి నిదురించెను.

మనోరమయు నాపాన్పుపై నిజభర్తను గాఢాలింగన మొనర్చుకొని గాఢనిద్దురం జెందిన యనంతర మాసమీపవృక్షమునుండి యొకగండభేరుండపక్షి యాసతీపతులగని, కీర్తిచంద్రుని నిరుపమాన తేజమున కచ్చెరువంది, రివ్వున నాపాన్పుకడవ్రాలి, మనోరమ బాహువల్లరిలో నిరుకుకొని సుఖనిద్దురం జెందుచున్న యాసుకుమారుని మెల్లన నొత్తిగించి, తన రెక్కలపై నిడుకొని, గగనమార్గమున నెగిరిపోయెను... మందారవల్లీ! వింటివా? ఏక్షణమున కేదిరానున్నదో యెవరుచెప్పగలరు? క్షణకాలముక్రిందట మహానందసాగరమున నోలలాడిన యానూతనదంపతులను విధాత యెట్లెడబాపుజేసెనో చూచితివా?" అని చిలుకచెప్పునప్పటికి 'నిజమే. దైవలీలల నెవరెరుంగజాలుదురు. కాని యోచిలుకా! ఇక నిద్దురవచ్చుచున్నది. నీమృదుపల్కులు నాకర్ణంబుల జొరుటలేదు. మిగిలినకథను రేపుచెప్పెదవులెమ్ము. నేటికి బరుందము" అనెను.

అంత నాశుకంబును పలుకుటజాలించి, యాపసిడిపంజరమునందు మేనువాల్చెను. మందారవల్లియు నిజమృదుపాన్పునజేరి నిదురించెను. నిద్రాంగన వారలనిరువురను నేకకాలంబున వరించెను.

---

## 26 గండభేరుండముకథ.



ఆ మరునాడైనను దప్పక రాజగృహంబునకరిగి, మలయకేతభూపతితో గామసుఖంబుల నందవలయుననెడి కృతనిశ్చయంబున మందారవల్లి యెప్పటికన్న నధికముగా నలంకారాధికముల బూర్తిగావించుకొని, పుడమినవతరించిన గంధర్వాంగనయో యనునట్లు సవిలాసంబుగ రాజాంతఃపురంబున కరుగవలయునని యారాత్రి పయనంబగుచున్న

మందారవల్లిసిగని, యాచిలుక "ఓయక్కా! స్త్రీలు మిగుల కఠిన హృదయులు—వారికి దయాంతఃకరణంబు లుండవుసుమా!" యన నామె యాశ్చర్యచకితయై "ఓ కీరరాజమా! నేడు నీపలుకులెంతయు జిత్రముగానున్నవి. స్త్రీలు కఠినాత్ములనియా నీనుడి! ఎందుచేత నట్లంటివి?" యని యడుగ నాచిలుక తిరుగ మందారవల్లికిట్లనియెను. "కోమలాంగీ! ఆ శృంగారవనంబున నూతనదంపతులగు మనోరమ, కీర్తిచంద్రు లొండొరు లెడబాసిరనికదా, గతరాత్రంబున జెప్పితిని. అట్లు వియోగజలధిని మునింగిన యాదంపతుల గతియేమయినదియు దెలిసికొనకుండగనే, కామవాంఛను నీవరుగుచుంటివి. స్త్రీలు దయారహితులని చెప్పుటకింతకంటెను బ్రబలనిదర్శనమేమికావలసియున్నది"

ఆచిలుకమాటలకు మందారవల్లి యెంతయుసిగ్గువడి "అయ్యో! అయ్యో! అడుగమరచితినే! గండభేరుండముచే గొంపోబడిన కీర్తిచంద్రుని వృత్తాంతమేమైనది? నిజభర్త నెడబాసిన మనోరమగతి యేమయినది? సత్వరంబున జెప్పుము. నేనద్దానినిగూడ నాలకించిన యనంతరంబె మలయకేతభూపతిని గూడనరుగుదానను" అనియెను. అంత నాచిలుక వైశ్యాంగనకిట్లు చెప్పుచున్నది.

"మందారవల్లీ! ఆగండభేరుండమట్లు కీర్తిచంద్రుని రెక్కలపై నిడుకొని యనేకములగు పర్వతములను, నదులను, గుహలనుదాటి, జంబూద్వీపమునంగల యొక దివ్యభవనమునందు బ్రవేశించెను. అట వానినొక హంసతూలికాతల్పంబునందు బరుండజేసి, సేదదీర్చుచు నత డింకను నిద్దురమేల్కాంచనందున, దానును మరియొకగదియందు నిదురించెను.

అమరుసటి ప్రాతఃకాలంబున నొకజగదేకసుందరియగు పదునారేండ్ల లేబ్రాయపుజవ్వని, వివిధమణిమయకాంచనాభరణ విభూషి

తయై, కీర్తిచంద్రుడు నిదురించుచున్న శయ్యాగృహము బ్రవేశించి, యట కోటిసూర్యోదయ ప్రభాసమానవిలసితుండగు రాజకుమారుని గని, "అయ్యారే! ఈపురుషుం డింద్రుడో, చంద్రుడో, మన్మథుడో ఇంతటిసౌందర్యము దేవతలకైనను నుండుట యరుదుకదా! ఈతని కౌగలించి, ముద్దాడి యధరామృతము గ్రోలని పడతుకజన్మంబు వ్యర్థమే యగును. ఇతనింగూడి మన్మథసామ్రాజ్యము నేలగలిగిన నాభాగ్యము నేమనవలయును? ఆహా! ఇతడిచటి కెట్లు రాగలిగియుండును. ఒకవేళ గండభేరుండము దెచ్చియుండునా? అయిన నాపక్షి యేమయ్యెను?" అని యిట్లామగువ చింతించుచుండులోపున, వేరొకమందిరమున నిద్రించిన గండభేరుండపక్షి మేల్కాంచి యటకరుదెంచి, యటనాశ్చర్యముతో నిద్రాముద్రితుడై యున్న రాజకుమారుని దిలకించుచున్న లావణ్యవతింగని "నాముద్దులపట్టీ! తారావళీ ఈమన్మథమూర్తిని నీకొరకై శృంగారవనమునుండి దెచ్చితిని. నేదివ్యయౌవన రూపములకు దగిన యీపురుషుడొక్కడే యీపృథ్వీతలంబునగలడు. ఇతనిం గూడి నీవు శాశ్వతకామభోగంబుల నందుము. ఇతడు మేల్కాంచునప్పటికి నన్నుగాంచిన భీతుడగును గాన నేనరుగుచున్నను. నీవే యీతని చెంతనుండి, వివిధోపచారంబులచే మేల్కొలిపి, సావధానంబుగ నీకోరిక నాతనికెఱింగింపుము" అని నుడివి గండభేరుండ మాతావును వీడి చనియెను.

అట వేచియుండిన తారావళి యట్లె మరికొంతతడవు కీర్తిచంద్రున కుపచారములనొనర్చిన యనంతరమాతడు మేల్కాంచి, తన యెదుటనిలుచున్న రూపందిన సౌందర్యదేవతనుగని, దిగ్భ్రమజెంది, "ఓతన్వీ! నీవెవ్వరిదానవు? ఇట్టి మహాతేజోవిలాసినివగు నీవు మానవాంగనవై యుండవు గంధర్వాంగనవో, యక్షకామినివో, నాగకన్నియవో జెప్పి, నాయలమటనుదీర్పవే? నాభార్యయగు మనోరమ

యెక్కడ? నేనీదివ్యభవనమున కెట్లురాగలిగితిని? ఇదేదియో మహామాయగా దోచుచున్నది? సర్వవృత్తాంతమును నాకెరింగించి ధన్యునిజేయవే" యన తారావళి చిరునగవు పెదవులచిందులాడ తన చంచలవీక్షణముల నారాజకుమారునిపై బరపి, యిట్లు చెప్పదొడంగెను" అనియంతవరకును జిలుక చెప్పునప్పటికి మందారవల్లి నిద్రాభరంబునకు దాళజాలక, "ఓ శుకచంద్రమా! ఇకనిద్దుర నాపుకొనజాలను. తారావళికీర్తిచంద్రునకు జెప్పిన తనవృత్తాంతమును నాకు రేపుచెప్పుము" అననాచిలుకయు నట్లనేయని, తనకథ నసంపూర్తిగావిడచి, యాపంజరమునందు నిదురించెను. అంతట మందారవల్లియు మరియొక పడకగదికరిగియట యమర్పబడియున్న మృదుపాన్పుపై బవ్వళించెను.

# 27 తారావళికథ.



అమరుసటిరాత్రంబున రతిక్రీడలదేల నుత్సాహపరవశతయై రాజగృహంబున కరుగుచున్న మందారవల్లిని చిలుకవారించి యిట్లు చెప్పెను. "ఓ సుందరాంగి! తారావళి కీర్తిచంద్రున కెరింగించిన తనవృత్తాంతమును నీకుజెప్పెద దానిగూడ నాలకించిన యనంతరము నీవు రాజగృహంబున కరుగవచ్చును.

నిద్రనుండి మేల్కాంచి యడిగిన రాజకుమారుని ప్రశ్నలకా తారావళి వానితో నిట్లు చెప్పుచున్నది. "ఓ మన్మథాకారా! నేను దేవలోకంబుననుండు నొక యప్సరసకాంతను. నన్ను తారావళియందురు. నేనయిదేండ్ల ప్రాయమునం దుండునపుడు చెలులతోగూడి యాడుకొనుచుండ నెందునుండియో యొకగండభేరుండపక్షి వచ్చి, నన్ను

దనరెక్కలపై గూర్చుండబెట్టుకొని యీజంబూద్వీపముజేర్చి నాటనుం డియు నతిగారాబముగా బెంచి, యింతదానినిగా నొనర్చినది. గాన నాకాపక్షియే తల్లియనుకొనవలయును. యౌవనోద్భూతనై యున్న నాకు దగినవరుని గొనిరావలయునని యామె కొన్ని నెలలనుండియు దిరుగుచు, తగినవాని నెందునుగానక, చివరకు శృంగారవనమున నిద్రించుచున్న నిన్నుగని, నీసౌందర్యాతిశయంబులకు మెచ్చి, తనరెక్కలపై బరుండజేసి నిన్నిటకు గొనివచ్చినది. ఆమెకడ విశేషధనమును లెక్కకు మించిన యనేక మాణిక్యరాసులుగలవు. ఈదివ్యభవనమున కామె యజమానురాలు. ఆమెకు బగగలిగెనేని, యెంతటివారినేనియు బ్రతుక నీయదు. కనుక నోమోహనాకారా! నీయందధికానురాగమును గలిగిన నన్నేలుకొని, నన్ను నీబాహువల్లరిలో నదిమి రతికేళిందేల్చి, కృతార్థురాలను జేయుము ".

అట్టుచెప్పిన తారావళి వాక్యములకు కీర్తిచంద్రుండు దనకట్టి నిరుపమానతేజోరాసిని లభించెగదాయని గొంత సంతసించెను. కాని యౌవనమునందు విడువబడిన నిజభార్యయగు మనోరమను దలంచి మనంబున గలవరపడుచుండెను. అయినను నాగండభేరుండపక్షికి వెరచి, తారావళి వాక్యముల కెదురాడక, యెట్లయిన నామెదయను సంపాదించి, మంచితనముననే నిజభార్యంజేరగోరెను. గాన నాటినుండియు గూడ కీర్తిచంద్రుండు తారావళినిగూడి ప్రతిరాత్రంబును సంభోగ సౌఖ్యములనందుచు, నామగువను సంతోషతరంగడోలికల నూగించుచుండెను. తారావళియు, నారాజకుమారుని పాన్పునుండి క్రిందయడుగు బెట్టనీయకుండ నెల్లవిధముల సేవలుసేయుచు వానితో రాత్రిందివముల తారతమ్యనుమరచి, మన్మథక్రీడలదేలుచు మహాభోగవిలాసములతో గాలముగడుపుచుండెను. ఓమందారవల్లీ! ప్రేమయనిన నాతారావళిదే ప్రేమయనవలయును. దేవాంగనయగు నా

తారావళి, యొకమనుష్యమాత్రుండగు కీర్తిచంద్రునియందట్టి యధి కానురాగంబుతో బ్రవర్తించుట యతిశయోక్తికాదా ?" అని చిలుక యడుగ, మందారవల్లి అవునని నుడివి, యప్పటికే చాలప్రొద్దుపోవుటచే, యికకథను వినజాలక నిజపాన్పునజేరి పవ్వళించెను. ఆ శుకశ్రేష్ఠంబును నాపంజరమునందే యొకకునుకుదీసెను.

# 28 శుక్రవారపునోముకథ.



"అక్కా! అట్లు శృంగారవనములో విడువబడిన మనోరమ గతి యేమయినదియు దెలియకుండగనే మదనవాంఛాలోలవై రాజగృహంబున కరుగుట నీకుదగునా ?" యని యామరునాటిరాత్రి రాజ గృహంబున కరుగనున్న మందారవల్లింగని చిలుక ప్రశ్నింప, నాజవ్వని "ఓచిలుకా! అవు నడుగమరచితిని. పాపమట్లు నిజభర్తృవిరహితయై యాశృంగారవనమున విడువబడిన మనోరమవృత్తాంత మేమయ్యెనో చెప్పుము. దానినిగూడ వినినయనంతరమే రాజగృహంబున కరుగు దాన" అనియెను.

అంతట కీరరత్నమా వైశ్యపుత్రిక కీవిధంబున జెప్పనారం భించెను. "అచట శృంగారవనమున కీర్తిచంద్రుని గండభేరుండము గొనిపోయినరాత్రిగడువ, నామరునాటియుదయంబున మనోరమ నిద్ర నుండి మేల్కాంచి, నిజపాన్పునందు ప్రియునిగానక, యావనమునంతను వెదకించి నిస్పృహజెంది, పలువిధంబులదలపోసి, "ఓ దైవమా ! ఇట్టి యనుకూలదాంపత్యమును జూడ నీకు గన్నులుకుట్టెనా ? వివాహమై యింకను నెలదినంబులుగాలేదే! ఇంతలోనే నాథ ర్తకును నాకును నెడ

బాటొదవజేయవలయునా ? ఓ ప్రాణనాయకా యెందేగితివి ? వనమంతటను వెదకితిని. ఎందును గానరాకపోతివి. ఏమిసేతు. నీబోటిమన్మథాకారుండగు మనోహరునిబాసి బ్రతుకుటకంటె నాత్మహత్య గావించుకొని మరణించుటయేమేలు. ఓపరమేశ్వరా! ముందుజన్మమునందైన నను నాకు గీర్తిచంద్రుని భర్తగా ననుగ్రహింపుము" అని కొండొకతడవు యెలుగెత్తియేడ్చి యనంతరము కీర్తిచంద్రుడు చేబూను రత్నపిడిగల కత్తినిదీసి పొడుచుకొన నుద్యుక్తురాలుకాగా చెలికత్తెలామెను వారించి "అమ్మా! ఆత్మహత్య మహాపాతకంబని విద్యలకు బాలవెల్లివైన నీకు మేము జెప్పవలయునా? బుద్ధిమంతులగువారికి వేగిరపాటుగూడదు. నీ ప్రియుండనతికాలములోనె రాగలడు. కనుక నిన్నిప్పుడే మీయత్తవారిల్లుచేర్తుము. అందు కొంతకాలమువరకును వేచియుండుము. నీవ దృష్టవంతురాలవైతివేని, నిజభర్తం బడయగలవు" అని యనేకవిధంబులగు నూరడివాక్యములబలుక, "ఓ యమ్మలారా! నాథునిగోల్పోయిన నాయీపాడుముఖము నత్తమామల కేరీతిని జూపగలను. ఛీ! అంతటి నీచకార్యమును జేయుమనుటకంటె నాయాత్మహత్యాకార్యమున కేలయనుమతినీయరు?" అని మనోరమ బోరున నేడ్చుచుండ నామెచెలులు "తల్లీ! యత్తవారింటికిజన నీకుమనసులేదేని, మనపట్టణమునకే బోవుదములెమ్ము. నీజనకుండు నిన్నుగాపాడి, నీభర్తను సమర్థులగు చారులచే వెదకించి రప్పింపగలడు" అని యామెనోదార్చి, ముత్యాలపల్లకియందు గూర్చుండబెట్టి, చంద్రగిరి గొనిపోవ సేవకబృందమున కాజ్ఞాపించిరి. అంత నెల్లరును ననతికాలంబులోనె దిరుగ చంద్రగిరిని జేరుకొనగలిగిరి. అట చంద్రసేనుండు సర్వమునెరింగి జామాత యెందేగినదియు దెలియజాలక, పతివియోగంబునకై మితిలేని దుఃఖమునందుచున్న నిజకుమార్తెను పెక్కురీతుల నోదార్చి, కొందర చారులరావించి, నానాదేశంబులబంపి, కీర్తిచంద్రు డెందున్నదియు దెలిసికొనిరా నాజ్ఞాపించెను.

పతివిరహితయగు మనోరమయు నట్లె గుందుచు, ప్రతిశుక్ర వారంబును నుపవాసముండి, కులదేవతయగు సావిత్రీదేవిని దీపధూప నైవేద్యంబులతో నారాధించుచు, తనభర్త ననతికాలంబులో దన్ను జేర్చుమని మ్రొక్కుకొనుచుండెను. ఇట్లేడు శుక్రవారంబులా పతివ్రత సావిత్రీదేవికి బ్రీతిగలుగునట్లు వ్రతమును నిష్టతోజరుప, నెనిమిదవ శుక్రవారమునాటిరాత్రి యాదేవి మనోరమకు స్వప్నమునందు సాక్షాత్కారమొసంగి "ఓబేలా! నీపూజాపురస్కారంబులకు నేను సంతృప్తనయితిని. అయినను నీభర్తను నేనీక్షణంబున నీకొసంగ నసమర్థురాలను. అతడు బహుదూరప్రదేశంబున నొక మహాశక్తియుతయగు యక్షకామిని స్వాధీనమందున్నాడు. నీవు మహాపతివ్రతవుగాన, నీనోములు వృధకానేరవు. నీవనతికాలంబులో నీభర్తను బడయగలవు. అంతదనుక నోపికబట్టియుండుము" అనిచెప్పి యంతర్థానమయ్యెను.

మనోరమయు నాదేవికి మనంబున శతనమస్కారము లొసంగి, యామె తనభర్త సుఖియైయున్నాడని చెప్పినందులకు గొంతసంతసించి, యాదేవి యానతిచొప్పున దనదేవుండగు కీర్తిచంద్రుని దర్శనదినంబునకై వేచియుండెను. అని చిలుక చెప్పునప్పటి కాలకాంగి తన నల్లని ముసుగును తొలగించుకొన నాలుగువైపులను వెలుగుతెరలుగప్ప నారంభించుటగని మందారవల్లి, "ఓయబ్బో! తెల్లవారనున్నది. ఇకపరుందము" అని పడకటింటికిజని నిజతల్పంబుపై బరుండెను. అంత నా చిలుకయు నాపంజరమునందే పరుండి నిదురించెను.

---

# 29 కలలోనికథ.



ఆమరుసటిరాత్రంబునగూడ నదేవిధంబున కోమటిపడతి మలయకేతభూపతిని గూడవలయుననెడి యాశతో సర్వామూల్యాంబరాభరణ విభూషితయై, యత్తరుమంచిగంధాది లేపనంబుల బూసికొని మన్మథ క్రీడోత్సాహియై రాజగృహంబున కరుగుచున్న సమయంబున చిలుక యామెనుబిలచి "అక్కా! మహాపతివ్రతయగు మనోరమకథను సాంతముగావినవా? ఆమెనోము ఎట్లు ఫలించినదియు దెలిసికొందువా? ఆమె భర్తకొరకేవిధముగా నుపవాసముంజేసి, సావిత్రీదేవి యనుగ్రహము నెట్లుబడసెనో గంటివా? పతివిరహితయగు నామెయు నీవలె నేరాజకుమారునితోనైనను వ్యభిచరించి, కామాంధురాలైనదా? ఆమె అట్టి మహాపతివ్రతగనుకనే దేవియనుగ్రహమును బడసినది" అన, మందారవల్లి సిగ్గుపడి, మహాతప్పిదము నొనర్చినదానివలె పశ్చాత్తాపపడుచు, "ఓబుద్ధిమంతమగు కీరరత్నమా! నీమూలమున నేడు నాకు జ్ఞానోదయమయినది. ఇక నాదుశ్శీలమునువీడి, రాజుతోగలయవలయుననెడి కోర్కెను జంపుకొంటిని. ఆహా! పతివ్రతామహిమం బెంతఘనమైనది! నాకు మహాసాధ్వియగు మనోరమతో బోల్చుకొన నర్హతలేదు. అయినను నామెవలె నేనును పరపురుషాపేక్షనువీడి నేటినుండియు పతివ్రతనై మెలంగుదాన. నాకిట్టిసద్బుద్ధిని గలిగించిన నీకు నానమస్కారము. ఏదీ మనోరమయొక్క తరువాయికథనుగూడ జెప్పి నన్ను ధన్యురాలినిగాజేయు" మని యానందపరవశతయై మందారవల్లి యడుగ, తనకోరిక నెరవేరినందులకును, మందారవల్లి సద్గుణవల్లియైనందులకును మనమున నెంతయు సంతసించి, యామెకు చిలుక తరువాయికథ నిట్లు చెప్పుచున్నది.

"ఓయమ్మా! అట దేవాంగననుగూడి దివ్యభవనమునందు సుఖించుచున్న కీర్తిచంద్రుండు నానావిధ దివ్యభోగంబుల నందుచుండియు, నిజపత్నీవియోగ పరితప్యమానసుండై "అయ్యో! నాభార్య నట్లు నట్టడవిలో దిగవిడచివచ్చితినే! ఆలతాంగితో మోహముదీర నొక్కనాడైనను సుఖింపనయితిని. ఆమెను మోసముజేసితినని నన్నన్నివిధంబులదూరి దుఃఖించి, యత్తవారింటికే యేగెనో, పుట్టినింటికేయేగెనో, లేక యాకారడవియందే యిడుముల గుడుచుచున్నదో కదా! అసలు యిలపై నున్నదో, లేనేలేదో! ఓభగవంతుడా! నాకేల యిట్టిసంకటమును దెచ్చిపెట్టితివి" యని కండ్లనీరుకార్చుచు యొకదినంబున జింతాక్రాంతుడై యున్న సమయంబున తారావళి, యాతనిని జేరంజని "ఓమోహనాకారా! నీమోము నేడిట్లు చింతారేఖాముద్రితంబై యుండినకతంబెయ్యది? ఇట నీకు సౌఖ్యములేదా? నాయొనర్చు సేవలయందేమయిన లోటుగలదా? నాసౌందర్యము నీకు నచ్చినదికదా? నేడిట్లీరీతిని మోవినొక్కక, పాలిండ్లచుంబించక, కౌగిలిదేల్చక, రతికేలియేల సల్పకుంటివి? నీమనోవిచారంబునకు గల కారణమును వేగిరముజెప్పి. నాయలమటను దీర్చుము" అని పలువిధంబుల నిర్బంధించియడుగ నారాజకుమారుండా దివ్యాంగన కిట్లనియెను. "ఓదివ్యకామినీ! నాకు నీభవనంబున నెట్టికొదువయునులేదు. నాబోటి సామాన్యమానవునకు నీబోటి యప్సరసాంగనాసాంగత్యము చేకూరుట నాపూర్వపుణ్యభాగ్యంబు. అయినను నాభార్యను నట్టడవిని విడచివచ్చితినిగదా! ఆయుత్తమసాధ్వి యేమయ్యెనో, యేదారిం జేరెనో యని నాటినుండియుగూడ నేను మనంబున గుమిలిపోవుచుంటిని. కాని నీవేమనుకొందువోయని చెప్పకుంటిని. ఇపుడు నీవు నిర్బంధించుటవల్ల జెప్పకతప్పినదికాదు" అని సవిచారముగానన, నాదేవాంగనయు నధికముగా విచారించి, "అయ్యో! ప్రాణనాయకా! యీ

సమాచారము నింతవరకు నేలచెప్పవైతివి? ఇపుడె నాతల్లియగు గండభేరుండపక్షిని బిలుతును. ఆమె నిన్ను రెక్కలపై గూర్చుండబెట్టుకొని మనోరమయున్న తావునకు గొనిపోగలదు. నీవు నీభార్యనుగలసి, యామెతో నొక్కరాత్రి సుఖించి, వెంటనే యిటకు దిరిగిరావలయును. అట్లు రాకుంటివేని నిన్ను శపించుదాన. నేడు శుక్రవారముకదా! ఇట్లే ప్రతిశుక్రవారమును వారమునకొక్కనాడు నీభార్యనుజూచి యిటకు వచ్చుచుండుము" అనిచెప్పి, గండభేరుండమును రావించి, కీర్తిచంద్రుని మనోరమకడకు గొనిపోయి, తిరుగగొనిరమ్మని నుడివెను.

అంత నాపక్షి కీర్తిచంద్రుని వినుతగిరికి గనురెప్పపాటున గొనిపోయి, జనకునియంతఃపురంబున నిదురించు మనోరమ పాన్పునుజేరెను. అంత నిదురించుచున్న మనోరమ మేల్కొని నిజభర్తంగాంచి, యాశ్చర్యసంభ్రమంబు లొక్కపరి మనంబున నుబుక వానికి నమస్కరించి, కౌగలించి మృదుపాన్పునంజేర్చి యుపచర్యలగావించెను. అంత శశికుమారుండును భార్యకు నిజవృత్తాంతమంతయుజెప్పి, దేవకామినికి గోపమురాకుండ ప్రతిశుక్రవారమును నామెయానతిచొప్పున వచ్చుచుండెదనని చెప్పి, యారాత్రియంతయు నామెతో మనసుదీర సంభోగసౌఖ్యములనంది, యామె నానందాబ్ధినోలలాడించి, తనరాక నేరికిని దెలుపవలదనిచెప్పి, గండభేరుండునిపై గూర్చుండి, తిరుగ దివ్యాంగనాసౌధమున కరిగెను. మనోరమ కదియంతయు నొకస్వప్నవృత్తాంతముగాదోచెను" అని చిలుక చెప్పునప్పటికి ప్రొద్దుపోవుటచే మందారవల్లి నాటికి నిదురించెను.

# 30 కీర్తికాముని కథ.



ఆమరునాడు మందారవల్లి యిక మలయకేతుని గృహంబునకు బోవ ప్రయత్నింపకయే పసిడిపంజరముననున్న చిలుకనుగని "ఓ బుద్ధిమతీ! ఆనాటిరాత్రంబున నట్లు కీర్తిచంద్రుడు మనోరమ యంతఃపురంబునజొచ్చి యామెతో గ్రీడించె, యామెను మదనక్రీడాసౌఖ్యమున దేల్చెనంటివికదా! యనంతర మేమైనది? యాగతవృత్తాంతమునుగూడ చెప్పి నన్ను గృతజ్ఞురాలిని జేయుమా!" అన నాశుకరాజము మందారవల్లిని సుఖాసీననుగమ్మని మనోరమ తరువాయికథ నీప్రకారంబుగా జెప్పదొడంగెను.

"ఆనాటి శుక్రవారము రాత్రంబునకువలెనే కీర్తికాముండు పదురాత్రంబు లేదుశుక్రవారములవరకును మనోరమతో మదనక్రీడలందేలుచు, యుదయంబుగాకుండగనే, తిరుగ బక్షివాహనుండై జంబూద్వీపంబునంగల దేవకన్నియంగూడి భోగంబుల దేలుచుండెను.

అట్లేడువారంబులును గడచినయనంతరము మనోరమకు గర్భచిహ్నములు గానుపించెను. ఈవృత్తాంతమును రాజకుమార్తెను బట్టలనుతుకు చాకితగనిపెట్టి, మనోరమతల్లియు, రాణియునగు నిందిరాదేవి కడకరిగి "ఓయమ్మా! నీకుమార్తెకు గోక కట్టుకొంగు అధికమైనది. దానబట్టి యేమాయెనో మీరే గ్రహింపుడు" అని చెప్పిపోయెను. అంత నామె యాశ్చర్యమంది కుమారితను బరీక్షించి, యామె కారు నెలల గర్భిణియని నిర్ణయించి, యీసమాచారమును ఱాజుకుజెప్ప, నతడధిక విచారాశ్చర్య నిమగ్నుండై, "అయ్యో! ఇదేటిచిత్రము! అల్లుడు మాడ యెటపోయెరిగి సంవత్సరమునుండి యెందును గానరా

డాయె. కుమార్తె గర్భవతియెట్లయినది? ఈసమాచారము లోకులకు దెలిసిన మనము తలలెత్తుకొనగలమా! ఈమె కామాంధురాలై, ఎవనినో గూడియుండెను. అక్కటా! ఈవృత్తాంతము వియ్యంకులకు దెలిసిన వారేమనుకొందురు? మనకీ నిర్భాగ్యురాలిమూలమున నెన్నడు లేని తలవంపులు రానున్నవికదా! ఏమిసేతుము దైవమా!" అని పరి పరివిధంబుల విచారించుచు తెరవుగానక యుండెను. తనసమాచారము నేరికిని దెలుపవలదని భర్తయాజ్ఞగాన, మందారవల్లి యావృత్తాంత మును మరుగుపరచి, ఎందరెన్నివిధంబుల నిర్బంధించి యడిగినను జెప్ప కుండెను.

అట జంబూద్వీపంబున తారావళి కీర్తికామునితో రతికేళిం దేలినయనంతరం బొకనాడు వానితో సరససల్లాపములాడుచు, "మనో హరా! నీభార్యయగు మందారవల్లిని జూడవలయుననెడికోరిక నాకు గలదు. నీవామెను నాకంటెను నత్యధికముగా బ్రేమించుటకామె యేపాటిసౌందర్యవతియో యవలోకింపవలసియున్నది" అన నారాజ కుమారుండు "తరుణీ! సౌందర్యమున నీకును నాభార్యకును పోలిక యేమి? యప్సరసాంగనవగు నీవెక్కడ? ఒక క్షుద్రమానవవనిత యగు యామెయెక్కడ? ఆమె నీయంతటి సౌందర్యవతి కాదుగదా, నీలోని లక్షోవంతు రూపమైనను నామెకడ లేకుండుట వాస్తవంబు. నేను ప్రేమించునది సౌందర్యమనుకొంటివా? పవిత్రప్రేమకును సౌంద ర్యమునకును నెట్టిసంబంధమును లేదుసుమా! ప్రేమ యాశ్వరదత్త మయిన శాశ్వతవస్తువు అది మన యదుపులోనుండి, మనకెక్కడగావ లయునన నక్కడ జన్మించునదికాదు. దాని లీలలను భగవంతుడు సహితము దెలిసికొన నసమర్థుండు. అయినను నీకు గోరికగలదుగాన నామెనుజూడుము. అందులకు నాకెట్టియభ్యంతరమునులేదు. ఈవార మునకుమాని, పై శుక్రవారము నీవుకూడ 'గండభేరుండనధిరోహించి

సాకోరమ్ము. మనోరమను జూడవచ్చు" నన, నాతారావళి వాని మాటలకెంతయు సంతసించి, యాపై వారము మనోరమనుజూడ నేగ నుండెను.

ఆనాడు మామూలు ప్రకారము కీర్తిచంద్రుడు పక్షివాహనుండై, మనోరమ యంతఃపురంబున ప్రవేశింప, నాడేలకో నామెవదనము విచారరేఖాముద్రాంకితమై యుండెను. అంత రాజకుమారుండామె నొడిలో గూర్చుండబెట్టుకొని సాదరముగనిట్లడిగెను. "ప్రేయసీ! నేడేలకో నీముఖము చిన్నవోయియున్నది. అందులకు గారణంబేమి?" యని ప్రశ్నింప, నామె కంటనీరుకార్చుచు, నుదరమునుజూపి, "నాథా! ఈనాగర్భిణీ వృత్తాంతమును తలిదండ్రులెరిగి నన్ను దుశ్శీలగా బరిగణించుచుండిరి. భవదాజ్ఞానుసారముగా మీవృత్తాంతము వారికెరింగింపనయితిని. సంఘములో దమకు దీరనియవమానము నామూలమున రానున్నదని వారు మిగుల విచారించుచుండిరి. ఇక యీగర్భమును దాచుటయెట్లో దెలియక విచారించుచుంటిని" అనిచెప్ప, నారాజకుమారుండామెతో నిట్లులనియెను. "ప్రేయసీ! ఇక నీవు విచారింపబనిలేదు. నాయజ్ఞాతవాసమునువీడి నిర్భయముగా చరించుటకవకాశము గలుగనై యున్నది. అది యెట్లనిన, వచ్చేశుక్రవారము నాడు దేవాంగనయగు తారావళి నిన్నుజూచు నభిలాషతో నీయంతఃపురంబునకు రానై యున్నది. అప్పుడు నీవామెను సకలవిధంబుల బూజించి, నన్ను విడువుమని ప్రార్థించితివేని, యామెకు గరుణకలిగి నీకోరికను నెరవేర్పగలదు. ధైర్యముగానుండు" మనిచెప్పి, యతడు తిరుగ గండభేరుండవాహనుండై దేవకన్యకకడ కరిగెను.

ఆమరుసటి శుక్రవారంబున మనోరమ దేవకన్యకను సత్కరించుటకు వలయుసర్వసన్నాహంబులజేసికొని, యామె నాసీనురాలింజేయుట కొకముత్యాలపీఠమును ప్రత్యేకముగా నలంకరించి, వివిధభక్ష్యపదా

ర్థముల సిద్ధముజేసికొని యామెరాకకై వేచియుండెను. సరిగా నర్థరాత్రంబగుసరికి తారావళి కీర్తిచంద్రసహితయై పక్షివాహనము నారోహించివచ్చి మనోరమయంతఃపురంబున వ్రాలెను. అంతట మనోరమ వారికెదురేగి సగౌరవంబున రావించి, నియమితపీఠంబుల నలంకరింపజేసి, యాదివ్యాంగనకు షోడశపూజాసత్కారంబుల నొసంగి, యనేకములగు భోజ్యంబులనొసంగి నమస్కరించి " ఓదివ్యకామినీ! నీరాకచే మదీయగృహంబు పావనంబైనది. మానవుల కలభ్యంబగు నీదర్శన భాగ్యంబుచే నాజన్మ సార్థకంబయ్యె " నన, తారావళి మనోరమయొక్క దేదీప్యమానసౌందర్యమునకు, వినయవిధేయతలకును మనంబున కెంతెయు నాశ్చర్యమంది, తానామెయెడజూపిన కఠినత కెంతయు సిగ్గుపడి, ఆపతివ్రతను నిజభర్తనుండి యెడబాటొందజేసినందుల కెంతయు విచారించి, వెండియు నామెతోనిట్లనియెను. " చెల్లీ! ఇన్నినాళ్ళనుండియు నీకును నీప్రియభర్తకును వియోగము గల్పించి నేను మహాపాపమును గట్టుకొంటిని. ఇక నీవెట్టివిచారమునులేక నీభర్తం గూడి శాశ్వతసుఖంబుల నందుము. నీభర్తయందు నేను బద్ధానురాగనైయుంటిని. అయినను నీకొరకు నీశీలమునకుమెచ్చి, నా ప్రేమను కోరికలను త్యాగమొనర్చుచున్నదానను. కాని ప్రతిపౌర్ణమినాడును నీవు నీభర్తతో నాద్వీపంబునకరుదెంచి, యట నాభవనమునందొక్క రోజుండి, నాకానందమును గూర్పవలయును " అనిచెప్ప, నాభార్యాభర్తలిరువురు నానందాబ్ధి నోలలాడి, యామె చెప్పినట్లొనర్చుట కంగీకరించిరి. అంత మనోరమ జననీజనకులరావించి పరమానందమున నిజభర్తను, దేవాంగనను వారికిజూపి, సర్వవృత్తాంతమును నెరింగింప వారానందపరవశులై, యల్లుని గౌరవించి, దేవాంగనకు బ్రణమిల్లి దమకుమార్తె పావనచరిత్రయనియు, మహాపతివ్రతయనియు నెరింగి బ్రహ్మానందమందిరి. అనంతరము తారావళి వారెల్లరకడ సెలవంది, మనోరమదంపతుల దీవించి, పక్షివాహనారూఢయై యరిగెను.

మరికొన్నాళ్లకొక శుభముహూర్తంబున మనోరమగర్భంబున మహాతేజోవంతుడగు కుమారుడుదయింప, రాజదంపతులెంతయు సంతసించి, యాబాలునకు జాతకాదికర్మల జేయించి, కీర్తికాముండను నామమిడిరి. అంత మరికొన్నాళ్ళుగడువ, కీర్తిచంద్రుడు భార్యాసుతసహితుండై మామగారియొద్ద శెలవుగైకొని, నిజపురంబగు వినుతగిరిజేరి, తలిదండ్రులకు బరమానందముగూర్చెను. అనంతరము కీర్తిచంద్రుడు పట్టాభిషిక్తుండై, నిజభార్యయు మహాపతివ్రతయునగు మనోరమను గూడి సర్వభోగంబులనందుచు, ప్రజాపాలనంబు జేయుచుండె. అక్కా! ఇక నాకథయు ముగిసినది" అని చిలుకచెప్ప, మందారవల్లి "మహాపతివ్రతయగు మనోరమకథను వినుటచే నేను పవిత్రురాలనయితిని. నానిజనాథుండు గ్రామాంతరములకరిగి బహుకాలం బయ్యెగదా! యెపుడువచ్చునో" అని తలపోయుచు, యనంతరము పవిత్రహృదయముతో మృదుపాన్పుజేరి నిదురించెను.'

---

# 31 విక్రమార్కునికథ.

ఈప్రకారంబుగా నాకీరరత్నము దినమునకొక్క కథచొప్పున ముప్పదిదినములును ముప్పదికథలనుజెప్పి, మందారవల్లి పరపురుషుని గూడి పాపమునందకుండ నట్లామెశీలమును గాపాడెను. అట్లు నెలదినములునుగడువ నామరునాడు మణులకై మలయద్వీపంబునకరిగిన మందారవల్లిభర్తయగు రత్నదీపుండు నిజగృహంబు చేరుకొనియెను. అంత మందారవల్లి నిజభర్తను మక్కువనుకౌగలించి, యభ్యంగనముజేయించి పంచభక్ష్యంబులతోడను భోజనమిడి, మృదుతల్పంబునజేరి యుపచార

వచనంబుల బలుకుచున్న యవసరంబున, అతడు గ్రామాంతరములకరిగిన తొలినాటినుండి, యానాటివరకును జరిగిన యావద్వృత్తాంతమును వానికిజెప్పి. తనకు మలయకేతభూపతిని గూడుచెడుతలంపు గలిగెననియు, తనప్రయత్నమును కొనసాగించుకొనుట కరుగుచుండు ప్రతిదినంబునను చిలుక తన్నువారించి, దినమునకొక్క కథనుజెప్పి, తన్ను పశ్చాత్తాప్తురాలినిగా నొనరించి శీలమును గాపాడెననియుజెప్ప, రత్నదీపుండు శుకముయొక్క యద్భుతశక్తికెంతయు నాశ్చర్యమంది బంగారుపంజరముకడకరిగి, తనభార్యశీలమును గాపాడిన యాకీరమునకు నమస్కరించి, "ఓ శుకమణీ! ఇట్టిమహాశక్తిసంపన్నుండవగు నీవు సామాన్యపక్షిమాత్రుండవుగావు. ఏసిద్ధుడవో, ఏమహాతపస్సంపన్నుండవోయైయుండి, విధివశంబున నిట్టిపక్షిరూపంబును ధరించియుందువు. నిన్నినాళ్ళనుండియు మాగృహంబున నుంచుకొనిపెంచుటచే మాజన్మలు చరితార్థతనందినవి. నాభార్యయొక్క దుశ్శీలమునుబాపి, యామెను మహాపతివ్రతగా నొనరించిన నీనిజవృత్తాంతమును మాకెరిగించి, ధన్యులజేయవే! ఓమహానుభావా! నీఋణమును మేము జన్మజన్మంబులకయినను దీర్చుకొనజాలము" అని పలువిధంబుల గొనియాడ నాచిలుక మందారవల్లీ! రత్నదీపులకు దననిజవృత్తాంతము నీప్రకారంబుగా జెప్పుచున్నది.

"ఓ వైశ్యదంపతులారా! నానిజవృత్తాంతమును జెప్పుమని కోరితిరిగాన జెప్పెద సావధానులై యాలకింపుడు—సకలసస్యసమృద్ధంబై, యధికజనావృతంబై, యత్యధికరమణీయ సుందరభవనప్రాకారనిర్మితంబై, భూలోకస్వర్గపురంబనదగు ఉజ్జయినీపురంబునకు నేను నాధుండను విక్రమార్కుండనువాడను, మహాసమర్థుండగు భట్టిసహాయ్యంబునను, అధికశక్తిసంపన్నులగు భేతాళ, కాళీమహాదేవుల దయవలన నేను ప్రజాపాలనంబు జేయుచుండ, వీరాచారియను నొక

కంసాలివాఁడు నాకడకరుదెంచి, నేనంతకుముందు నేర్చియున్న పరకాయ ప్రవేశవిద్యను దనకు నేర్పవలసినదని ప్రార్థనపూర్వకంబుగా బలు విధంబుల వేఁడెను. కంసాలివానికి బరకాయప్రవేశవిద్యను గరపుట ప్రమాదహేతువని మంత్రియగు భట్టి యెన్నివిధంబుల జెప్పినను వినక, నేనాకంసాలివానియందు దయగలవాఁడనై, వానికి బరకాయ ప్రవేశవిద్యను నేర్పితిని. బుద్ధిమంతుఁడగు మంత్రిమాటలువినకపోబట్టి కదా యీవిధంబుగ గుందవలసివచ్చెనని యిపుడు విచారించిన నేమి లాభము ?

నేనొకసమయంబున మేధావియగు భట్టికి రాజ్యభారమును వదలి నానియమముప్రకారము దేశసంచారము జేయవలసినకాలము రాగా, నిజపురినివీడి చనుచుండఁగా, గంసాలియగు వీరాచారియు నాతో దేశములజూడ పయనంబయ్యెను. అట్లు మేమిర్వురమును నానాదేశం బులను సంచరించుచు, అందలిగవిపింతల దిలకించుచు నొకనాఁడొక యరణ్యమును బ్రవేశించి, యటగల నొకవృక్షచ్ఛాయను విశ్రమిం చితిమి. అపుడా వృక్షాగ్రమునుండి యొకమగచిలుక నేలబడి మరణిం పగా, నందున్నయాఁడుచిలుక భర్తృవియోగమునకై మహాదుఃఖమున నేడ్వసాగెను. అంత నేనావిలపించు ఆఁడుచిలుకయందు జాలిగలిగిన వాఁడనై, పరకాయప్రవేశంబు నెరింగినవాఁడనగుటచే నామృతమైన మగచిలుకశరీరమునందుసొచ్చి, నానిజశరీరమును జాగ్రత్తగా చూచు చుండుమని ఆచారికిజెప్పి, యాచిలుకరూపముతో వృక్షమునకెగిరి అట్లు దుఃఖించు భార్యచిలుకకు భర్తనై దానివిచారమును బోగొట్టితిని. ఈలోపున దుర్మార్గుఁడగు కంసాలివాఁడు నారాజ్యభోగంబుల ననుభ వింప గోరికగలవాఁడై, యతఁడును బరకాయవిద్య నేర్చినవాఁడుగాన, అట నేనువిడచిన నానిజశరీరముంజొచ్చి, యుజ్జయినికింబోయెను. అంత

నిజశరీరమునుబాసిననేను చేయునదిలేక, యీవృక్షమునందె చిలుకల కన్నింటికిని రాజునై కాలముగడుపుచుంటిని.

ఇంతలో నొకవేటకాడు వలనుబన్ని మమ్మెల్లరను బట్టుకొని యెను. అంతనేను నానేర్పున మిగిలినచిలుకలనన్నింటిని విడిపించి దుర దృష్టవశంబున నేనుమాత్రము వానికిజిట్టుపడవలసివచ్చె. ఓవర్తకశిఖా మణీ! ఆవేటగాడే నన్నునీకడకు గొనివచ్చి వేయివరహాలకమ్మెను. ఒక కొరగానిచిలుక వేయివరహాలమూల్యమా, యని తలంపక నాపలు కులువిని నన్నంత టమూల్యమునకుగొని, నన్నావేటగానిబారినుండి తప్పించిన నీయందు నాకధికవిశ్వాసముగలదు. దానంజేసి నీయింగడ యందు నేనుండి, నాపలుకులచే నెల్లరనాకర్షింపజేసి, యెల్లబేరములనీకే వచ్చునట్లొనర్చి, తన్మూలమున నీవు నాకై వెచ్చించిన ధనము దిరుగ బడయునట్లు చేసితిని.

అనంతరము నీవు గ్రామాంతరముల కరిగినపుడు నీభార్యయగు మందారవల్లి ఈపట్టణమునకురాజైన మలయకేతునితో గామసుఖం బులనంద గోరికగలదై, యనుదినంబును రాత్రులందు శింగారించు కొని రాజగృహంబున కరుగుచున్నసమయంబున, నేనామెనువారించి, నాశక్తినంతను జెప్పుచు, యీమెప్రయత్నమును భగ్నమొనర్చి, యీమెకు శీలభంగమొదవకుండ గాపాడగలిగితిని. ఆఖరిదినంబున మహా పతివ్రతయగు మనోరమకథను వినుటచే నీభార్య తనచెడుప్రయత్న మునువీడి, పుణ్యశీలయయ్యెను. ఓవైశ్యమణీ! ఈప్రకారంబుగా నేను నీఋణంబును దీర్చుకొనగలిగితిని. నారాజ్యంబేరీతినున్నదో, అట నాచారి నారూపంబుననుండి యంతఃపురస్త్రీల కెట్టిమోసము దలపెట్టు చున్నాడో! నేను రాజ్యమునువీడి బహుపెద్దకాలంబైనది. ఇక నానిజపురంబుజేరి, నిజకాయంబున జేరుటకు బ్రయత్నింప ననుమతి నీయుము” అనిచెప్ప, నావైశ్యదంపతులు చిలుకరూపంబున నున్న

విక్రమార్కునకు నమస్కరించి, “ ఓయవక్రపరాక్రమధౌరేయా ! విక్రమార్కభూపతీ ! మాతప్పులనన్నింటిని క్షమింపుము. మేమింతకు ముందే నీసాహసవితరణాది సద్గుణంబుల వేనోళ్ళవింటిమి. కాని యీ చిలుకరూపంబున నిన్నుగుర్తింపలేకపోతిమి. నీకాశ్రయమిచ్చిన మా జన్మంబుతరించె. నీవిక నిజరాజధానింజేర మాయనుమతి కావలయునే నీకనుమతులనీయ మేమెంతటివారము ? నీవొంటరివై యీచిలుకరూపంబున బోయిన తిరుగ నేయపాయంబులు వాటిల్లునో ! కనుక నేడు మేమే యొకగూఢచారుని యుజ్జయినికిబంపి, నీమంత్రియగు భట్టికి యిటనున్న నీసమాచారమును దెలియజేయుదుము. అతడువచ్చి నిన్ను సురక్షితముగా నిజరాజధానిం జేర్పగలడు ” అనిరి. వారిసదుద్దేశంబునకు విక్రమార్కుండెంతయు సంతసించి, భట్టివచ్చువరకును నావైశ్యులయింటనే యుండుటకు సమ్మతింప, నావైశ్యదంపతులు మిగుల సంతసించి, యొకసమర్థుడగు గూఢచారునిరావించి వానికి జెప్పవలసిన రీతులజెప్పి యుజ్జయినికిం బంపిరి.

---

# 32 ఉపసంహారము.

అనంతరము మందారవల్లినిగామించిన మలయకేతభూపతి రత్నదీపుండరుదెంచుటచే నిక తన ప్రయత్నము కొనసాగనేరదనియు, అత డూరలేనప్పుడు ఎన్నికబురులనంపినను మందారవల్లి తనయంతఃపురంబునకు రాకుంటచే, నామెకుదనయందు మక్కువలేదనియునెంచి, యతడు తనతలంపును వీడెను. అందులకు మందారవల్లి భర్తయగు రత్నదీపు నట్టియిడుములనుబెట్టక యెప్పటితీరున గౌరవింపుచునే యుండెను.

ఆవైశ్యదంపతు లనుదినంబును చిలుకరూపంబుననున్న విక్రమార్కునకు సకలవిధోపచారంబుల జేయుచు, వివిధరీతుల బూజించుచు నొకవారముదినములు గడుప, యుజ్జయినినుండి భట్టి వారియింటికి గూఢచారునితో నరుదెంచి, చిలుకరూపంబుతోనున్న విక్రమార్కుని కౌగలించుకొని, కన్నీటినివిడుచుచు, “ ఓమహానుభావా! సప్తాంభోదీభూ ప్రపంచంబునునేలు సామ్రాట్టువగు నీకు నేటికాదుర్మార్గుడగు ఆచారిమూలంబున నీచిలుకరూపము ప్రాప్తంబయ్యెనా! ఆహా! విధిప్రేరణమెట్టిది! అతడట్లు నీశరీరంబునుజొచ్చి యుజ్జయినిం బ్రవేశింప యింకను గడువుపూర్తికాకుండగనే నీవరుదెంచుటకు నేనెంతయు దొలుత నాశ్చర్యపడితిని. అనంతరము భేతాళుండా వచ్చినవాడు విక్రమార్కుండుకాడనియు, దుర్మార్గుడగు వీరాచారియనియు జెప్పి నన్ను శంకనుండి బాపెను. అంతనేను అంతఃపురస్త్రీలకును రాజ్యమునకును వానిమూలమున నెట్టియాపదయు రాకుండ భేతాళుని జూచుచుండుమనిచెప్పి, మూడుదిక్కులకును సమర్థులగు గూఢచారుల బంపి నిన్ను వెదకించుచు, నాల్గవదిక్కున నేను వెదకుచు, నన్ని దేశంబుల దిరుగుచుండ, మార్గమునందీ వైశ్యపుంగవునిచే బంపబడిన గూఢచారుండు నన్నుగలసుకొని, నీయావద్వృత్తాంతమును నాకు జెప్పి యిటకు గొనివచ్చెను. మహాత్మా! ఇక నిజరాజధానికి బోదమురండు. ఆదుర్మార్గుడగు కంసాలివానిని మోసగించి, మీశరీరమును మీరు బడయుటకు బ్రయత్నింపవలయును ” అనిచెప్పెను.

అంత చిలుకరూపంబుననున్న విక్రమార్కుండును భట్టిభుజంబునవ్రాలి “ ఓమంత్రిపుంగవా! ఆనాడు నీవు చెప్పినవినక, దుర్మార్గుడగు కంసాలికి పరకాయప్రవేశవిద్యను జెప్పుటచే నాకీ యపచారము వాటిల్లినది. ఈవైశ్యదంపతులు బహుయోగ్యులు. నన్ను వేటగాని బారినుండిగాపాడి ఇన్నినాళ్ళనుండియు నన్ను గంటికిరెప్పవోలె గాపాడిరి. వీరికి మనము వివిధసత్కారముల నొసంగవలసియున్నది ” అన, భట్టి తనతోదెచ్చిన యమూల్యగత్నహారములను, చీనిచీనాంబరములను నావైశ్యదంపతులకు గానుకలర్పించి, వారివల్ల దిరుగ ననేకబహు

మాసంబులనొంది, వారియొద్ద శలవుబుచ్చుకొని చిలుకరూపుండైన విక్రమార్కుండు భేతాళుని మనంబునదలచి యతడురాగా, భట్టీవిక్రమార్కు లిరువురును భేతాళవాహనులై పయనంబై యచిరకాలములోనె యుజ్జయినింజేరిరి.

అట నుజ్జయినీనగరమునందు భట్టి విక్రమార్కుని నిజకాయప్రవేశంబును జేయుటకై దగినయదనుకొరకు వేచియుండి, యొకనాడు కపటవిక్రమార్కుండగు కంసాలవానినిజేరి, "అయ్యా! ఇంతకుముందంతఃపుర కాంత లారుమాసములు పురుషనంటని వ్రతము బూనుటయు, అంతదనుక దమరంతఃపురంబు బ్రవేశింపరాదనియు మీ రెరింగిన విషయమేకదా! నేటి కారుమాసములును బూర్తియైనవి. తమరింక యంతఃపురంబునుజేరి యా కామినులతో గూడి సుఖించుసమయమే తెంచినది. కాని వ్రతసమాప్తిగా గొఱ్ఱెపోతులపందె మొకటి జరుగవలసియున్నదనియు, అందొకపోతు రాణులదియు, రెండవది తమదియు నైయుండుననియు, నందు రాణులపోతుగెలిచి, తమపోతోడినచో దిరుగ నారుమాసములు వ్రతము సాగవలసియున్నదనియుచెప్పి పోతులదెబ్బలాటకు దగినయేర్పాటుల గావింపుమని రాణులు వర్తమానము నంపియున్నారు. దాన మీయభిప్రాయమేమి?" అనినుడువ, విక్రమార్కరూపధారియగు వీరాచారి, తనకు విక్రమార్కుని రాణుల గూడి కామభోగంబుల నందుయదను దొరకినందులకు మనంబున నెంతయు సంతసించి, మంత్రియగు భట్టినిగని "ఓసచివోత్తమా! అది యెంతటికార్యము? నేడే రెండుగొఱ్ఱెపోతులను దెప్పించి పందెముగట్టించి, రాణులకోరికదీర్చి, వారివ్రతసమాప్తి నందింపుము" అనియెను.

అంతకుముందె భట్టి యొకబలిష్ఠమయినట్టియు, నొక బలహీనమైనట్టియు గొఱ్ఱెపోతులను దెప్పించియుంచెనుగాన, నపుడా రెంటిని దెప్పించి, యందు బలముగలిగినది రాణులపోతుగను, బలహీనముగనున్నది విక్రమార్కుని పోతనియుజెప్పి, దెబ్బలాటను ప్రారంభింప

జేసెను. అంత మాయవిక్రమార్కుండగు కంసాలివాని గొఱ్ఱెయు, నిజవిక్రమార్కుని రాణులగొఱ్ఱెయు దెబ్బలాటకు దలపడెను. అవి రెండును కొండొకతడవు ఘోరముగాబోరెను. అంతట బలిష్ఠియగు రాణులగొఱ్ఱె, మాయవిక్రమార్కునిగొఱ్ఱెను దనకొమ్ములతో బొడిచి చంపి క్రిందబడవైచెను. తనగొఱ్ఱె యోడినందున దిరుగ నారుమాసములవరకు రాణులనుగూడుటకు వీలులేదుగాన, కపటవిక్రమార్కుడగు కంసాలి వెంటనే తనదేహమునువీడి, చచ్చిపడియున్న తనగొఱ్ఱె దేహమునందు బరకాయప్రవేశముజేసి, తిరుగ రాణులపోతుపై విజృంభించి, దానితో బోరాడుచుండెను. అదేసమయమనియెంచి, చిలుకరూపముతోనున్న విక్రమార్కుండు, కంసాలివాడువిడచియున్న తననిజశరీరముంజొచ్చి, చిలుకదేహమును విసర్జించెను. అనంతరము రాణులపోతునుజంపి, తనపక్షమును గెలుపొందజేసిన వీరాచారి తిరుగ విక్రమార్కుని శరీరముకడకువచ్చిచూడ, నందు నిజవిక్రమార్కుండు ప్రవేశించియుండుటకు మిగులవిచారించి, యదియంతయు భట్టియొక్క తంత్రమనియెఱింగి, యేమిచేయుటకునుదోచక యాగొఱ్ఱెదేహమునందె యుండెను. అంత భట్టి విక్రమార్కుని యానతినంది, దుర్మార్గుడగు గొఱ్ఱెరూపముననున్న కంసాలిని వధించి, వాడు తిరుగ నేకాయమునందును బ్రవేశింపకుండజేసెను.

అనంతరము విక్రమార్కుండు నిజశరీరముతో నిజసింహాసనము నధిష్టించి, యంతఃపురస్త్రీల కెల్లవిషయములజెప్పి, వారితో సర్వభోగంబులందుచు, మహాసమర్థుండగు భట్టిసాహాయ్యంబున మహావైభవంబున రాజ్యపాలనంబు చేయదొడంగెను.

సంపూర్ణము.

రాజమండ్రి: శ్రీసత్యానందప్రెస్‌నందు, ముద్రింపఁబడినది—1937.

# మైలవరం కంపెనీవారిచే ప్రదర్శింపబడు

# నాటకములు.

| | రు | అ | | రు | అ |
|---|---|---|---|---|---|
| కనక్తార చం. కె. | 1 | 4 | తులసీదేవి ము. వెం. చ. | 1 | 0 |
| హరిశ్చంద్రీయము బ. ల. | 1 | 0 | చింతామణి కా. నా. | 1 | 0 |
| బుద్ధిమతీవిలాసము ,, | 1 | 0 | వరవిక్రయం డిటో | 1 | 0 |
| శ్రీకృష్ణతులాభారము ము. సు. | 1 | 0 | మధుసేవ డిటో | 1 | 0 |
| కృష్ణలీల బళ్ళారి పం. కె. సు. | 1 | 4 | పద్మవ్యూహం డిటో | 1 | 0 |
| లవకుశ డిటో | 1 | 4 | పాండవవిజయం తి. వెం. క. | 1 | 0 |
| రంగూన్ రౌడి సో. రా. | 1 | 0 | పాండవోద్యోగము అను శ్రీకృష్ణరాయబారం డిటో | 1 | 0 |
| వేణీసంహారము వ. సు. | 1 | 0 | పాండవాశ్వమేధం డిటో | 1 | 0 |
| సాత్రాజితీయము బ. ల. | 1 | 0 | సావిత్రి శ్రీ. స. | 1 | 0 |
| ఉత్తరరాఘవం కుశలవ | 1 | 4 | ద్రౌపది మ. అ. | 1 | 0 |
| రామదాసు బళ్ళారి డి. గో. | 1 | 0 | అనసూయ సో. రా. | 1 | 0 |
| బొబ్బిలియుద్ధం శ్రీ. కృ. | 1 | 0 | రసపుత్రవిజయము ఇ. య. | 1 | 0 |
| పాదుకాపట్టాభిషేకము పా. ల. న. | 1 | 4 | జయంతజయపాల అ. స. | 0 | 12 |
| విప్రనారాయణ డిటో | 1 | 0 | కన్యాశుల్కము గు. అ. | 1 | 0 |
| సారంగధర డిటో | 0 | 8 | శాకుంతల కం. వీ. | 1 | 0 |
| రాధాకృష్ణ డిటో | 0 | 12 | ధరణికోట సో. రా. | 1 | 4 |
| చూడామణి డిటో | 0 | 12 | చండిక ము. వెం. | 1 | 0 |
| రోషనార కొ. సు. | 1 | 0 | మహాకవికాళిదాసు అ. హ. | 1 | 0 |
| గయోపాఖ్యానం చి. ల. | 0 | 8 | చిత్రాభ్యుదయము కా. నా. | 1 | 0 |
| ప్రసన్నయాదవము చి. ల. | 0 | 8 | కంఠాభరణం పా. ల. | 1 | 0 |
| పారిజాతాపహరణం డిటో | 0 | 8 | మోడరన్ బి. ఎ. | 1 | 0 |
| గ్రామఫోనుపాటలు 900 | 0 | 4 | ఎక్సెకాలేజిగరల్ | 1 | 0 |
| | | | మధుసేవ కా. నా. | 1 | 0 |

# జ్యోతిష గ్రంథములు.

| | రు | అ | | రు | అ |
|---|---|---|---|---|---|
| జ్యోతిష ప్రథమబోధిని | 0 | 8 | నవగ్రహచింతామణి | 0 | 2 |
| జాతకమార్తాండము 1,2భా॥ | 3 | 0 | శల్యవాస్తు | 0 | 12 |
| ,, 3 భా | 2 | 0 | జాతకఫలమణిమంజరి 1భా | 1 | 8 |
| జ్యోతిషరహస్యం 1 భా | 1 | 8 | గర్గసంహిత | 0 | 4 |
| ,, 2 భా | 1 | 8 | బృహత్పరాశరసంహిత | 0 | 4 |
| జ్యోతిషవిద్యాప్రకాశిక సంజ్ఞాధ్యాయము 1 భా | 1 | 0 | ఆంధ్రజాతకతత్వము సూత్రములు 1, 2 భా॥లు | 3 | 0 |
| గణితాధ్యాయము 2 భా॥ | 1 | 0 | గోచారసంహిత | 0 | 12 |
| భావఫలాధ్యాయము 3 భా | 3 | 0 | కాలామృతము | 0 | 12 |
| ద్వాదశభావఫలము 4 భా | 2 | 0 | శిల్పిసంగ్రహము | 0 | 6 |
| జ్యోతిషఫలపరిదర్శని | 0 | 10 | ఆయుర్దాయయోగం | 1 | 0 |
| అదృష్టదీపిక | 0 | 10 | ముహూర్తదర్పణం | 0 | 8 |
| హస్తసాముద్రికము | 0 | 6 | రెట్టమతశాస్త్రము 60 సం॥ పంచాంగము | 0 | 12 |
| దశాభుక్తిఫలచంద్రిక అను వృద్ధపారాశరి | 1 | 0 | జాతక నారాయణీయం | 1 | 8 |
| పుట్టుమచ్చలశాస్త్రము | 0 | 8 | స్వప్న ఫలదీపిక | 0 | 8 |
| జాతకచంద్రిక గోపాల రత్నాకరము | 0 | 8 | సకలసర్వగుణ అదృష్టదీపిక | 0 | 10 |
| | | | గౌతమసంహిత | 0 | 8 |
| మయివాస్తు, వాస్తుశిరోమణి, సనత్కుమారవాస్తు (ఈ 3 చేర్చి ఒకేపుస్తకం) | 0 | 12 | వాంచానాదీయం | 0 | 8 |
| | | | జాతకరాజీయం | 1 | 0 |
| | | | జ్యోతిషఫలగ్రంథము | 0 | 2 |
| వాస్తుసంగ్రహము | 0 | 12 | శకునశాస్త్రం | 0 | 8 |
| మూలస్తంభము (శైవగ్రంథము) | 0 | 8 | స్త్రీజాతకం | 0 | 8 |
| | | | పూర్వపారాశరి | 0 | 8 |
| యవనజాతకం | 0 | 8 | అను భూతజాతకతరంగిణి | 0 | 8 |

